

హోరుగాలి

—ఫొటో: జి. రామమూర్తి—మద్రాసు.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.




సచిత్ర వారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 47
సంచిక 26
10-3-54

విజయ ఫాల్గుణ శుద్ధ షష్ఠి; బుధవారం

## త్వరలో — బొమ్మరిల్లు సీరియల్:

## శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి

# "కర్పూర ద్వీప యాత్ర"

"మబ్బు పట్టకుండా ఉంటే ఇవ్వాళ రాత్రే కాస్త పొద్దుపోయేదాకా మేలుకొని కళ్లువిప్పి ఆకాశంవంక చూడండి.. చీకటి రాత్రి కావాలె!

"నక్షత్రాలమీదగుండా ఆకాశంమీద రెండుదారులుగా చీలి పాలుపోసినట్లుగా వెలుతురు కనబడుతుంది. అదే పాలపుంత అనీ, కాశీరామేశ్వరాలదారి అనీ అంటారు. అందులో ఒకచోట దట్టంగా కాంతిమేఘమువలె కనబడుతుంది. అదే కర్పూరద్వీపము!

"ఇంకా జాగ్రత్తగా అందులో చూడండి. నాన్న పడుకున్నట్లు, పక్కనే అమ్మ కూర్చున్నట్లూ కనిపిస్తారు. ఆ చుట్టుపక్కల ఇంకా చాలా చిన్న చిన్న చక్కని చుక్కలు మిణుక్కు మిణుక్కుమంటూ కనిపిస్తవి. అవి చుక్కలు కావు. కర్పూర ద్వీపంలో ఉండే పిల్లలూ పిల్లవాళ్లూను.

"మనలను ఈలోకంలో కన్నారనుకునే అమ్మా నాన్నా మనల్ని కన్న అమ్మా నాన్నా అనుకున్నారా? ఎబ్బే! కానేకాదు!

"అసలు మనమంతా ఆ కర్పూరద్వీపంలో ఉండే ఆదిదంపతుల పిల్లలమే. వాళ్లకు మనలని చూడాలని మోజుపుట్టినప్పుడు రమ్మని పిలుస్తారు. మనమంతా కర్పూరద్వీపంలో ఆడుకొంటూ పడవెక్కి వచ్చిన పిల్లలమే!........"

పిన్నలకు పెద్దలకు, స్త్రీపురుషులకు, పండితపామరులకు అందరికీ సుబోధకంగా చెప్పబడిన కథ. మన పూర్వసంస్కృతినీ, భారతీయుల ఆధ్యాత్మిక ఔన్నత్యాన్నీ ప్రతిబింబించగల ఈ పుణ్యగాథ పాఠకులకు విజ్ఞానదాయకము, ఆనంద దాయకమూ కాగలదని మా విశ్వాసం.

—సంపాదకుడు.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం!-- "సంగ్ దిల్"లో మధుబాల.








"వినదగు నెవ్వరు చెప్పిన;
వినినంతనె వేగపడక - వివరింపదగున్;
కని కల్ల నిజము తెలిసిన
మనుజుడెపో నీతిపరుడు - మహిలో
సుమతీ!"

తా॥ ఓ మంచిబుద్ధి గలవాడా! ఎవరు ఏది చెప్పినప్పటికీ వినవలెను. వినినతోడనే, తొందరపడక దానినిగూర్చి పరిశీలన చేయవలెను. అన్ని విషయములను స్వయముగా చూచి,కల్లయేదో నిజముయేదో తెలిసిన మనుష్యుడే యీ లోకమందు నీతిపరుడు.

సుమతీ శతకంలోని యీఅందమైన కంద పద్యం తెలియని కుమతి కుజనులలో (యీ భూజనులలో) లేడు. "కు" అనే అక్షరానికి "భూమి"అనేఅర్థంకూడా ఉంది. "కువలయము" అంటే "భూవలయము". ఈ విధంగా యీ భూమిలోని జనులందరూ అనగా కుజనులు (చెడ్డజనులు) కావచ్చు. "కు" అంటే "చెడ్డ"అనే అర్థంకూడా ఉంది. కనుక, కుజను లందరూ కుజనులే అయినట్లయితే, "ఓ సుమతీ!"("ఓ మంచిబుద్ధి గలవాడా!") అని కవి ఎవరినిగూర్చి సంబోధించ వీలగును? భూజనులందరూ చెడ్డజనులు కారనే నమ్మకముతోనే సుమతీశతక కర్త ఆ శతకమును, నీతిబోధ శతకంగా రచించి లోకానికి సమర్పించియున్నాడు. ఆ శతక కర్త బద్దెప్రభువు అని అంటారు. లేదా బద్దెన మంత్రి అని ఊహించుచున్నారు. బద్దె ప్రభువు చెప్పిన నీతులను అన్నింటిని శ్రద్ధగా వినవలసివదనిన్నీ, ఆ నీతులలో ఎంతవరకు సత్యమున్నదో, ఎంతవరకు అసత్యమున్నదో నిదానంగా పరిశీలించి చూడవలెననిన్నీ (తన శతకానికి పీఠిక తాను వ్రాసికొనక పోయినప్పటికీ) పీఠికతుల్యముగా తన శతకములో యీ పద్యాన్ని ,తన "పాఠకుల కొకమనవి" అన్నట్లుగా రచించినాడు. "నేను చెప్పిన నీతులను వినవలసినది. విన్నంతమాత్రముచేత తొందరపడవద్దు. నిజానిజములను నిదానంగా విమర్శించి తెలిసికోవాలి" అని తన శతకంలో తాను చెప్పిన నీతుల కన్నింటికీ వర్తించేటట్లుగా హితోపదేశం చేశాడు. "కల్ల నిజము తెలిసిన" అని స్పష్టంగా వ్రాసియున్నాడు. అబద్ధమెంతవరకు ఉన్నదో నిజము ఎంతరకు ఉన్నదో కాచి, కరగించి,వడపోసి, చెరగి, జల్లించి, వస్త్రగళిత మొనర్చి, మథించి, శోధించి, స్తనశల్యపరీక్ష చేసి, నిర్దుష్టంగా, నిష్పాక్షికంగా, నిర్ధారణగా, కల్లకపటంలేని తేట తెల్లమైన నిత్యసత్యమేదో గ్రహించండి. అన్నాడు. సుమతీ శతకంలో కల్లయున్నా నిజమున్నా కలసి మెలసి కలగాపులగమువలె, కలగూరగంపగా, నానాగోత్రంగా, పంచకోలకషాయంలాగున ఉన్నవా? అని సందేహించవలసి వస్తుంది. కల్లయున్నా, నిజమున్నా కలిసిఉండకపోయినట్లయితే, కల్ల నిజమును విమర్శించి, విభజించి,విశ్లేషించి,అందులో ఉన్న నిజమును మాత్రమే గ్రహించి కల్లను గర్హించండి అని ప్రత్యేకోపదేశమును చేయవలసిన అగత్యముండదు. కాబట్టి తన నీతి శతకంలో ఉన్నదంతా నిజమే అనెడి అహంకారం ఆ గ్రంథకర్తకు లేదు. కించిజ్ఞత్వం కలిగిన అల్పజ్ఞులైన వాళ్లు మనుష్యులు. సర్వజ్ఞత్వం కలవాడు భగవంతుడొక్కడే. కనుక నా గ్రంథంలో అసత్యం లేదనెడి హామీ మహామహులైనవాళ్లు గాని, హేమాహేమీలైనవాళ్లు గాని యివ్వలేరు. అందుచేత తాను చెప్పిన నీతివాక్యములలో నిత్య సత్యవచనములుగా గ్రహించుటకు వీలులేని విషయములు కొన్ని యుండవచ్చుననెడి విన్నపము ఆ పద్యములో సన్నసన్నగా సూచింపబడింది. ఆ గ్రంథకర్త యొక్క కాలమునాటికి నీతిగా, లోకసత్యముగా గ్రహింపబడిన విషయము అనంతరకాలములో అసత్యము కావచ్చు. ఎందుచేతనంటే, కొన్ని పద్యాలలో అటువంటి విషయాలు అక్కడక్కడ కన్పిస్తాయి.

# ★ కాలక్షేపం ★

"అలుని మంచితనంబును
గొల్లని సాహిత్యవిద్య కోమలి నిజమున్
............
తెల్లని కాకులును లేవు
తెలియర సుమతీ!"

అని ఒక పద్యంలో వ్రాశాడు.

"అల్లుని మంచితనంబును" అనే పద్యం చూడండి. ఈ సుమతీ శతకం రచించిన బద్దెన మంత్రికూడా ఒక రింటి అల్లుడై యుండగలడు. అతడు తనకు తానే అల్లుడు చెడ్డవాడు అని చెప్పకొనజాలడు. పై పద్యము తనవంటివారికి తప్ప తదితరులకు వర్తించుననేయెడల, తనవంటి సత్ప్రవర్తన గల అల్లుళ్ళు అనగా సరసులు సజ్జనులు అల్లుళ్ళ తెగలో ఉండగలరని అంగీకరించక తప్పదు. తన మాటపైన తానే గీటుపెట్ట వలసి వచ్చును.

ఆయనకాలంలో గొల్లనికి సాహిత్యవిద్య లేకపోవచ్చు. కాని ఆకాలంగడచిపోయింది. యాదవులలో ఎద కదలించే కవిత్వము చెప్ప కల్గినవారు ఆంధ్రదేశంలోనే అవతరించి సుమతీ శతక వాక్యములు అవాకులు చవాకులుగా ఉన్నవని తిన్నగా ఋజువు చేయుచున్నారు. "కోమలి నిజమున్" అనేది కూడా అసంభవం అన్నాడు. సత్యానికి నిలువబడి సత్యాగ్రహంచేసిన కోమలులు అసత్యశీలురని చెప్పటకంటె అసత్యమింకొకటిలేదు. డొక్కా సీతమ్మగారు అసత్యవాదులైన దొంగలు తన యింటికివస్తే వాళ్ళనుకూడా సత్యనిరతులనుగా చేసింది. గాంధిమహాత్ము డుపదేశించిన సత్యధర్మపథమును ఆ యిల్లాలు అవలంబించినట్లుగా ఇలలోగాని కలలోగాని కని విని యెరుగము. కాబట్టి "కోమలి నిజమున్" కలదా? అనే సంశయం చిత్రాంగివంటి కొందరు సుందరాంగనలపట్ల వర్తించునేమోగాని, అది సర్వసర్వత్రనిస్సంశయముగా వర్తించ దగిన సంశయముకాదు. "తెల్లని కాకులును లేవు తెలియర సుమతీ!" అనే మాటకూడా నిజముకాదని తెలియరసుమతీ! అని సరిదిద్ద వలసి వచ్చును. మద్రాసులోని మృగఖగ ప్రదర్శనశాలయందు ఒక తెల్లనికాకి యొకప్పుడు ప్రదర్శింపబడుతూ ఉండేది. యీరీతిగా యీ పద్యాన్ని వాక్యార్థంచేసి యీ కెకు యీకె తోకకు తోకగా విమర్శించడంఎందుకంటే, ఒకప్పుడు స్థూలంగా నిజం అనుకొని, లోకోక్తిగా చెప్పకొనే విషయాలు కూడా సరిగా పరిశీలించిన పిమ్మట నిజం కావనే నిజం బయట పడుతుంది. నిజానిజ పరిశోధన కూడా ఖనిజపరిశోధనవంటిదే. మాటలు వేయు నేల? నిజం నిలుకడమీదగాని తెలియదు.

అయితే అంత ఓపికగా అంత శ్రద్ధగా పరిశీలించడానికి ప్రతివానికీ కోరిక, ఓపిక, తీరిక ఉండాలి. అయితే, యీ ఓపిక, యీ తీరిక కొంతవరకే, కొంత పరిమితివరకే ఉంటాయిగాని, అంతులేనిఓపిక, అంతులేని తీరిక, బ్రహ్మాండనాయకుడైనవానికి కూడా ఉండదు. ప్రతి విషయం నిజమూ, అబద్ధమూ అని ఒంటికాలి మీద దీర్ఘకాలం మననంచేస్తూ, ఆత్మవితర్కంచేస్తూ ఉండవలసి వస్తుంది. ఎంత కాలమైనాసరే నిజమా అబద్ధమా అని శంకిస్తూ సంశయిస్తూ ఉండవలసి వస్తుంది. అటువంటి నిత్యసంశయం ఆయుఃక్షయం అంటారు. "సంశయాత్మా వినశ్యతి" అనే మాటకూడా నిజమే. విత్తుముందా? చెట్టుముందా? అనే శంకతో ఎంత కాలం తర్కించినా సృష్టికి మూల కారణం ఏదో అంతు చిక్కదు. సృష్టికర్త అనేవాడు యీ సృష్టి అంతా ఎందుకు చేశాడు? వేరే పనిగాని పాటుగాని లేక, పేకాట ఆడుకున్నట్టుగా బొంగరం తిప్పకొన్నట్లుగా తన లీలావినోదార్థం యీ జగత్తు అంతా గిర్రున తిరిగేటట్లుగా చేస్తూ, పుట్టుతూ, పెరుగుతూ, నశిస్తూ ఉండేటటు చేస్తున్నాడా? సృష్టిలీల అనేది ఏ ఉద్దేశంతో ఎందుకోసం జరుగుతోంది? జగత్తు అనేది ఎందులోనుంచి సృష్టిచేయబడింది? పంచభూతాలలోనుంచి అంటారు. ఆ పంచభూతాలు ఎందులోనుంచి? ఇంకోతత్వంలోనుంచి? కావచ్చు—ఆ తత్వం ఎందులోనుంచి ఈవిధంగా ఏదో ఒకటి మూలవస్తువు అని చెప్పడానికి అవకాశం లేదు. ఎందుచేతనంటే, తిరిగీ ఆ మూల వస్తువు ఎందులోనుంచి వచ్చింది? అనే ప్రశ్న యింకా సి. ఐ. డి. పోలీసువాని వలె వెంటాడుతూనే ఉంటుంది. కాబట్టి యిటువంటి మూలవస్తు తత్వపరిశోధన సంబంధమైన మూలశంకకు ఎప్పుడో ఒకప్పుడు ఎక్కడో అక్కడ తెగిపోవడం అనేది ఉండాలి. అట్టి మూలశంకకు శస్త్రచికిత్స ప్రశస్తం. అది పండితుల కవశ్యకర్తవ్యం.

తర్క పండితుల నిరంతర విషయమథన మగాధంగా అనంతంగా సాగుతూ ఉంటుంది. సూర్యునిచుట్టూ భూమి ఎంత కాలం విధివిరామం లేకుండా తిరుగుతూ ఉంటుందో పండితుల బుర్రలుకూడా యీ సంశయములచుట్టూ గిరగిర తిరుగుతూ ఉంటాయి. ఆ సంశయాలు అట్లాగే ఉంటాయి. ఆ బుర్రలు అట్లాగే తిరుగుతూ ఉంటాయి. అయితే, భూదేవియంత ఓపికతో మన బుర్రకూడా తిరుగుతూఉండాలి. భూమి నిశ్శబ్దంగా తిరుగుతోంది. కాని, ఉపన్యాసాలుచేస్తూ ప్రచారంచేస్తూ సంచారం చెయ్యడం లేదు. నిశ్శబ్దంగా మౌనంగా తిరుగుతోంది. అదేవిధంగా ఎవడిబుర్రలో వాడు యీ విషయాలను యీ సంశయాలను గూర్చి మననం చేసుకుంటూ మథనం చేసుకుంటూ తిరుగుతూ ఉండడం ఉత్తమం. అడిసన్ అనే మహాకవి ఒక చక్కని పద్యం ఇంగ్లీషులో వ్రాశాడు.

*"What though in solemn*
*silence all*
*Move round this dark*
*terrestrial ball?"*

"మౌనముద్ర వహించి యీ గ్రహ-
మండలం బతి శాంతిమై
భూప్రదక్షిణ చేయుచుండిన-
యప్రశస్తమె దానికిన్?"

ఆ గ్రహములన్నియు మౌనంగా తిరుగుచున్నప్పటికీ నియమితమార్గం తప్పకుండా నియమంగా ఋజుగతిలో ప్రవర్తిస్తున్నాయి. అదేవిధంగా మౌన ముద్రాంకితుడై నియమనిగ్రహంలో ఋజుమార్గం తప్పకుండా మానవుడుకూడా ప్రవర్తించడం మంచిదనేభావం ఆ కవి సూచించాడు. మేధా దక్షిణామూర్తి స్తోత్రములో కూడా "మౌనవ్యాఖ్యాప్రకటితనిజబ్రహ్మతత్వం" అన్నారు. మౌనంవల్లనే నిజబ్రహ్మ తత్వమునుగూర్చి వ్యాఖ్యానం ప్రకటింపబడిన దగుచున్నది. మౌనంగా గతి తప్పకుండా

ఊళ్ళోకి కొత్తగా రెండంతస్తుల బస్సు వచ్చింది. ఇద్దరు స్నేహితులు ఈ కొత్త బస్సులో ప్రయాణం ఎలా వుంటుందో చూద్దామని ఎక్కారు. అందులో ఒకడు ముందుగా గబగబ రెండో అంతస్తులోకి ఎక్కాడు. వెంటనే అంత త్వరగానూ కిందికి దిగిపోయి, నోటమాట రాక నిశ్చేష్టుడై పోయాడు. "ఏమిట్రా సంగతి," అనిఅడగ్గా "బాబోయ్, ఛస్తే పై కెక్కకూడదు. అక్కడ డ్రైవరెవడూ లేదు," అని జవాబిచ్చాడు.

సంచరించే గ్రహగణం అంతా ఏమని ప్రకటించుచున్నదంటే,

*"They all proclaim,*
*The hand that made us is divine."*

"పూని ఎవ్వడు మమ్ముచేసెనో -
వాని హస్తము దివ్యమనుచును
వెలుగుచుక్కలు - వెల్లడించును"

పరబ్రహ్మతత్వమును మౌనంగా ప్రకటిస్తున్నదీ తారకాగణం అని అడిసన్ మహాకవి ఇంగ్లీషు పద్యములో వ్రాసినది దక్షిణామూర్తి స్తోత్రంలో ఉన్న వాక్యానికి చక్కగా సమన్వయిస్తోంది.

కాని, ఒక్క విషయం ఉంది. మన ప్రవర్తనవల్లనే లోకానికి కావలసిన నీతిఅంతా నేర్పవచ్చు. మాట లెన్ని చెప్పినా ప్రయోజనం లేదు. నీతిశతకాలు శతసహస్రాలుగా రచించి అచ్చొత్తించినప్పటికీ, ప్రజల హృదయంలో అని అచ్చుపడనేరవు. గాంధి మహాత్మునివంటి మహాపురుషులు అవతరించినప్పుడు వారి మార్గం అనుసరించడానికి అసంఖ్యాకులు ఆవిర్భవిస్తారు. వాన కురియగానే ఎక్కడినుంచి వస్తాయో లెక్కలేనన్ని కప్పలు బెకబెకమంటూ బహిరంగసభలు చేసి, కొన్ని నినాదాలు చేస్తాయి. కాని, ఆవర్షపు నీరు అంతా ఇంకిపోయి, తడి నేల పొడి నేల అయినపిమ్మట, ఆ మండూకమండలం ఇంద్రజాలంవలె మందునకైనా కన్పించకుండా మాయమైపోతుంది. గాంధిమహాత్ముడు ఉన్నంతకాలమూ, ఊరికొక గాంధీ, పేటకొక గాంధీ, వెలసినట్లుగా ఎక్కడచూచినా,

"గాంధీ మహాత్ముని
కొలుతాం! కొలుతాం!
గాంధీమహాత్ముని
తలుతాం తలుతాం
గాంధీమహాత్ముని
మరువాం మరువాం"

అనే నినాదాలు విన్పించాయి. గాంధి మహాత్ముని "మరువాం మరువాం" అని పాడిన పాటలనే మరచిపోయినారు. "మరువాం మరువాం" అని ఆయనను ఆ బాలగోపాలం శిరసావహించింది. ఈనాడు "మరువాం" "మరువాం" అనేకేక "మరువం దవనం" అమ్మే పూలబజారులో చెవిని పడుతోంది. మన ఆడవాళ్లుమాత్రము "మరువం మరువం" అని కలువరించి దానిని యీనాడు శిరసావహిస్తే శిరసా వహించవచ్చు.

ఇది ప్రపంచచరిత్రలో విచిత్రవిషయం కాదు. ఏసుక్రీస్తు జన్మించాడు ఆయనవెంట ఆవేశంతో అశేషజనం ఆయన మహత్తులు చేసి చూపిస్తున్నాడని తిరిగారు. రామాజులవారు అవతరించారు అస్తమించారు. వారివెంట కమండలములు చేతపట్టి తిరిగిన మండూక బృందం ఆయనచుట్టూ రాసక్రీడ చేసింది. సూదంటురాయిచే ఆకర్షించబడిన ఇనుపముక్కలవలె వారు చక్కగా అతికి ఉండి, అయస్కాంతం అంతర్ధానం కాగానే, ఇనుపముక్కలు అక్కడక్కడ పడిపోయి త్రుప్పుపట్టి మట్టిగలసి, పొట్టికథలు పిట్టకధలుగా వారి చరిత్రలు తాటియాకులలోకి ఎక్కి పురాణగాధ లవుతాయి. ఈ పాత పురాణాలన్నీ కట్టిపెట్టి, వర్తమాన వ్యవహార సమస్యలను, కొత్తగా విడుదలయైన ఫిల్ములను చూచుకుందామంటుంది లోకం. అందువల్ల మహాత్మునివంటి జననాయకుడు ఉన్నంతకాలమే, ఆనేత చూపిన నీతిమార్గంతో లోకం పునీతమవుతుంది. నేత పోయిన తర్వాత మిగిలేవి నీతిశతకాలు. నీతి సహస్రాలు. కనుక సుమతీ! (ఓ మంచిబుద్ధి గలవాడా!) ఎవడైనా అవతార పురుషుడు అవతరించేవరకు నీకు నీతిశతకములే శరణ్యములు. ఈ నీతిశతకములలో అనేక విషయాలు ఉంటాయి. ఆ శతకములలో వ్రాయబడినవన్నీ శ్రద్ధగా విను. శ్రద్ధగా విమర్శించు. తొందరపడవద్దు. వాదతర్కములతో వాక్యార్థములతో గంభీరోపన్యాసములతో గడబిడచేయవద్దు.

మౌనం వహించు. మననం చేయి. అది చేస్తే నీకు ఎవ్వరూ ఏమీ చెప్పనక్కర లేదు. చెప్పేవాళ్ళు, అనగా ఉపన్యాసాలు చెప్పేవాళ్ళు ఉంటేగదా, వినడం అనేది సంభవిస్తుంది. కాబట్టి చెవి నిల్లు కట్టుకొని నిరంతరనీతిసారప్రచారం చేయడానికి శ్రీరంగంనుంచి వట్టె వర్ధనాచార్యులవారెవ్వరూ రానక్కరలేదు. మనం శ్రీరంగం వెళ నక్కరలేదు. ఆ మాటకువస్తే గ్రంథాలన్నీ లేకపోయినా, నీతి అనేది ప్రపంచంలోపోదు.

సుమతీ! నీవు సహజసిద్ధంగానే సుమతివి. సహవాసదోషంవల్లనే అహం తెలిసికోలేక ఇహంపరం తెలియక ప్రవర్తిస్తున్నావు. కనుక సంగత్వం పోతేనే, నీ రంగు నీకు తెలుస్తుంది అన్నారు శంకరాచార్యుల వారు. "నిస్సంగత్వే నిశ్చలతత్వం" అన్నారు. కల్ల నిజం తెలిసికోనే శక్తి నీలోనే ఉంది. నీవే సుమతి. కనుక సుమతికి సుమతీ శతకం ఎందుకు?

# సుకవి ప్రశంస

నండూరి రామమోహనరావు



విరహిజన మౌన పరి
వేదనల వేదముల
నెలుగెత్తి గానమొన
రించు పుంస్కోకిలము.

తృషిత పృథ్వీస్థలీ
హృదయ తోషణఫణితి
గంభీర గళమెత్తి
గర్జించు నంబుదము.

"తమ మెడలె, నవదినో
దయమాయె"నని నిద్రి
తజగజ్జనులనెల్ల
ద్విజకులము మేల్కొలుపు.

సుకవికావ్యము శ్రావ్య
పికగీతమై, జలద
గర్జనమై, విహం
గమరుతమై, నెగడు.

# పరిణామం

## సుబ్బలక్ష్మి

పెళ్ళిల్లు నిర్జనంగా వుంది. అంతా మొగ పెళ్ళివారికి ఎదురు సన్నాహం ఇవ్వడానికి వెళ్ళారు. సంధ్యవేళ మంచంమీద పడుకొనిఉన్న పెళ్ళికూతురు శ్రీమణి బుర్రలోకి అంతులేని ఆలోచనలు వస్తున్నాయి. ఒక్క సంవత్సరంలో వచ్చిన విచిత్ర పరిణామం ఆశ్చర్యం కలిగిస్తోంది శ్రీమణికి. దీనికి కారకు లెవరు? తానా, తన తండ్రా లేక అతనా? సరిగా సంవత్సరం క్రితం తాను ఏం చేస్తున్నది, ఏ పరిస్థితులలో ఉన్నది? అవును, దైవఘటన అంటే ఇదే కాబోలు.

అది రెండేండ్ల క్రిందటి మాట. తాను B. Sc. ఫస్టు క్లాసులో పాసు అయినట్లు తెలిసినవాడు తన తండ్రి కళ్లు తృప్తితో మెరిశాయి. నాన్నకెంత సంతోషం కలిగించాను! అని తాను సంతసించింది. ఇంక పైచదువుకి ఎలాగూ, పంపదలుచుకోలేదు నాన్న. అది తనకీ తెలుసు. నాన్న పట్టుదలతో సంబంధాలు చూడటం మొదలుపెట్టారు. ఒక్కొక్కటి తప్పిపోయినప్పుడల్లా నాన్న ఎంతో బాధపడేవారు. పాపం నాన్నకి ఎంత శ్రమ! అని తానూ మనసులో కించపడేది. నెలలు గడిచిపోతున్నాయి.

ఓనాడు నాన్న వూరెళ్ళారు. ఆ సంబంధం స్థిరపరుచుకుని వస్తారనే అమ్మ నమ్మింది. తానుకూడా మనసులో అలానే అనుకొంది. మరునాడు నాన్న వచ్చి "పది వేలకి దమ్మిడీ తక్కువైతే మాటలే అనవసరమని అన్నాడే తండ్రి" అని అమ్మతో అన్నప్పుడు తనుకూడా చింతించకపోలేదు. నాన్న "ఇది ఎంతో సలక్షణమైన సంబంధం. ఇది కుదిరితే మనం గట్టెక్కినట్టే" అని అన్నప్పుడు అమ్మ "పిల్ల వచ్చిందికదండీ, ఇక కట్నాలు, కానుకలు సంగతేగా, ఎలాగో ఒప్పిస్తే సరి" అంది. తానుకూడా ఇది ఎలాగో స్థిరపడితే బాగుండు అనుకొంది. నాన్నకి శ్రమ తప్పుతుంది. పైగా తన చెల్లెలు, తమ్ముడు, ఇద్దరూ స్కూలుఫైనలు చదువుతున్నారు. చెల్లెలికి పెళ్ళి, తమ్ముడికి కాలేజీ చదువు ఉన్నాయి. నాన్నకి ఆ మూడొందలు జీతం తప్ప వేరే ఆధారం లేదు. పది వేలు కావాలంటే ఎలా పోగుచేసి తెస్తారు?

ఓనాడు నాన్న ఆఫీసునించి ఇంట్లోకి రాగానే లోనికి వస్తూ "నువ్వు పంపమని వ్రాశావేమిటి మణీ?" అంటూ అందించారు. "అవును నాన్నా" అంది మెల్లగా కాఫీ కలుపుతూ. నాన్న ఇంకేమీ మాట్లాడలేదు. మరునాడు తానే స్వయంగా పూర్తిచేసి పంపింది. పది రోజులకి రమ్మని కార్డొచ్చింది రేడియోవారినుంచి. నాన్న మాట్లాడకుండా కార్డుతోపాటు పదిరూపాయల నోటుకూడా అందించి వాకిట్లోకి వెళ్ళిపోయారు. తనకి ఆశ్చర్యము కలిగింది. తాను ఊరికే ఇంట్లో కూర్చుంటే పొద్దుపోదని "B T. చదువుతాను నాన్నా, ఓ ఏడు కాలక్షేపం అవుతుంది" అంటే, ఉద్యోగం కోసం కక్కుర్తిపడ్డట్టు ఉంటుందమ్మా. ఆ B. T చదవకపోతేనేం? అని అన్నారు. మరి ఇది కేవలం ధనార్జనేకదా! ఎలా ఒప్పుకొన్నారు? తనమాట కొట్టివేయలేక, ఇచ్చి ఉంటారు నోటు. పోనీ వెళ్ళక మానేస్తే? తన నోటితో నాన్న ఒద్దని అననప్పుడు ఎందుకు మానటం? పైగా డబ్బుకూడా ఇచ్చారు. అంత పరువు తక్కువ పనిఅయితే ఖండితంగా ఒద్దనిఉండేవారు. తానేమీ యెదిరించి వెళ్ళదుకదా!

వెళ్ళింది. సెలక్టు అయింది. ఇంటికి వచ్చింది. మళ్ళీ యథాప్రకారంగా నిర్వ్యాపారం. అసలు ఏమీ తోచక ఇదోటి పెట్టుకొంది. కాని రెండు మూడువారాలకోసారి ఓరోజు కాలక్షేపం. అంతే. ఆ ఏడు గడిచిపోయింది.

సీత, సుందరం, స్కూలు ఫైనలు పూర్తిచేశారు. ఇద్దర్నీ, పైకి పంపాలి. తనొక్కర్తికే నెలకి నూరు పంపేటప్పటికి ఇంట్లో ఇబ్బంది అయేది. ఇప్పుడు ఇద్దరికి పంపడం మరీ కష్టం. పోనీ సీతని చదువు మాన్పిద్దామంటే, అది నాన్నకి సుతరామూ ఇష్టంలేదు.

ఓనాడు తానే ఎత్తింది ప్రసంగం. "నాన్నా, మేం ముగ్గురం ఉంటాం నాన్నా గుంటూరులో ఇల్లు తీసికొని, ఇక్కడ ఊరికేనే ఉన్నానుగా?"

నాన్న ఆశ్చర్యంతో చూశారు తనవైపు.

"తమ్ముడు మగసాయం ఉన్నాడుగా, నేను వండి పెడుతుంటాను. కొద్దిలో తేలిపోతుంది ఖర్చు" అన్నది తాను.

నాన్న ఏం మాట్లాడలేదు. మరునాడు సాయంత్రం తాను దక్షిణపుదొడ్లో మల్లెపూలు కోస్తూండగా దగ్గరికి వచ్చి "ఎ. సి. కాలేజిలో సీట్లకోసం ప్రయత్నం చేస్తాను మణీ, అమ్మకికూడా నచ్చింది" అన్నారు. తాను నమ్మలేకపోయిం దివార్త.

ఎరికున్న వాళ్లింట్లో ఓ వాటా అద్దెకి పుచ్చుకొని ఉన్నారుముగ్గురూ. ఏదో కొద్ది మార్పు. పొద్దున్నా, సాయింత్రం, కొంచెం పని. అంతే. వాళ్లు కాలేజికి వెళిపోతే తాను ఊరికే అలాగ పడుకొని కాలం గడపాలి. వాళ్ళు వొచ్చేదాకా పనీ లేదు, వ్యావృత్తిలేదు. మాట్లాడుకోడానిక్కూడా ఎవరూ లేరు. ఇంటావిడ ఓ ముసలమ్మ. ఆమె స్నేహితురాండ్రు ఓ అరడజను ముసలివాళ్లే చేరతారు. వాళ్లకబుర్లు తనకు నచ్చవు, ఏమీ తోచదు. నాన్న వారం విడిచి వారం ఆదివారంనాడు వచ్చి చూసిపోయేవారు.

ఓసారి నాన్నతో తానంది "ఇక్కడ గరల్స్ హైస్కూలులో లెక్కల ఎసిస్టెంటు పోస్టు ఖాళీగా ఉందట" అని. నాన్న అర్థం కానట్లు చూశారు. కాసేపున్నాక "నీఇష్టం తల్లీ" అని ఊరుకొన్నారు. నాన్న వెళ్ళిపోతూండగా "నాకేమీ తోచడంలేదు నాన్నా, అందుకని" అంది. "నీ ఇష్టం అన్నానుగా మణీ" అని వెళ్ళిపోయారు.

స్కూల్లో జాయినయింది. ముగురూ పదింటికల్లా ఇల్లు తాళంపెట్టి వెళ్ళిపోయేవారు. మళ్ళీ సాయింత్రం ఇంటికి చేరడం. తనకికూడా రోజులు ఇట్టే గడిచిపోతున్నాయి. వచ్చే తొంభైరూపాయిలు కొంత తన పాకెట్ మనీకింద, కొంత అవసర ఖర్చులకీ వాడేది. నాన్నకికూడా ఉసలాగా ఉంటున్నది. పైగా రేడియోప్రోగ్రాముల వల్ల కొంతవస్తుంది. దానితో అక్కడే ఏ చీరో కొనుక్కొని ఇంటికొచ్చేది తను.

ఓసారి తాను ఓగంట నాటికలో పాల్గొనాలి. రిహార్సల్సు కోసమని ముందుగా ఓసారి వెళ్ళింది. ఆ నాటకంలో నే పాల్గొంటున్న ఒక యువకుని చూసింది. ఎక్కడో చూసినట్లుంది ముఖం. కాని జ్ఞాపకం రాలేదు. రిహార్సల్సు అయిపోగానే కాంటీనుకి వెళ్లారు. అక్కడ అతనే తనని పలకరిద్దామని ప్రయత్నించినట్లు గ్రహించింది తను. కాని తానేమీ తొణకలేదు.

ప్రోగ్రామునాడు ఓగంట ముందుగానే ఎసింబిల్ అయారు అందరూ. అతను తన దగ్గరికి వచ్చి "నమస్కారం శ్రీమణిగారూ!" అన్నాడు. అప్పటికీ తన కసలు జ్ఞప్తికి రాలేదు. "జ్ఞాపకం లేదేమోలెండి, ఫరవాలేదు. వెడతాను" అని తలవంచుకుని వెళ్ళిపోయాడు. పాపం, ఎంత సిగ్గుపడ్డాడో, కాని తానేం చేస్తుంది? ప్రోగ్రాం మొదలెట్టేదాకా ఆలోచిస్తూనే ఉంది. ప్రోగ్రాం చివర పాల్గొన్న వాళ్ళ పేర్లలో అతని పేరు గోపాలం అని చెప్పడం వింది. [illegible]క్కని



మధురానగరి రాచబాట

చిత్రకారుడు : కె. ఆనంద్. (గుడివాడ).

# పరిణామం

జ్ఞాపకం వచ్చింది తనకి. అతను గోపాలమే సంవత్సరం క్రితం పది వేలు కావాలన్న గోపాలమే. అవును, తప్పక అతనే.

కాంటీనులో తానే పలకరించింది. "నమస్కారం గోపాలంగారూ!" అని. అతనిముఖం వికసించింది. "నీకింకా జ్ఞాపకం ఉన్నందుకు సంతోషం" అన్నాడు.

"లేకపోతే తమవంటివారిని మరచిపోతామా ఏమిటి?" అంది. అతను తలవంచుకొన్నాడు. ఎంతో బాధ కనపడింది ముఖంలో. అరె! ఎంత ఫీలవుతున్నాడో! ఎందుకు? తానన్న మాటల్లోని వ్యంగ్యం అర్థమయింది కాబోలు. అయితే ఆనాడు పదివేలడిగినపుడున్న భేషజమేమయింది? ఆనాడు లేని సిగ్గు ఈనాడెందుకు? అసలు సిగ్గుపడాల్సిన అవసరమేమిటి? అతనిపై తనకి ఏవగింపు కలిగింది. కాని, మాటలతో బాధపెట్టడం మంచిదికాదు. మర్యాదగానే మాట్లాడి అవతలికి తప్పుకొంటే సరి.

"సరి, వెళ్ళొస్తానండి" అని లేచింది. ఇంటికి వెళ్ళిపోయింది. కాని ఎందుకతనిని దెప్పానా? అని బాధపడుతూనే ఉంది. ఆతనికీ, తనకీ, ఈషణ్మాత్రం సంబంధం కూడా లేదు. తోటి రేడియో ఆర్టిస్టు, అంతే. మరి తాను మాటలతో దెప్పడానికి అధికారమెక్కడిది? తానుచేసింది తప్పు. ఎవరో ఆడపిల్లల్ని గన్నతండ్రి పది వేలూ, సమర్పించి, పిల్లనిచ్చిఉంటాడు. ఇక నెప్పుడూ నోరు జారకూడదు. అనుకొంది.

ఓనాడు స్కూలునించి ఇంటికి నడిచి వస్తూండగా అతను ఎదురైనాడు. ఇతనీ వూళ్లో ఎందుకున్నాడు? చేతులో పుస్తకాలు ఉన్నాయి. తనచేతిలో కూడా ఉన్నాయి.

"అరె! మీరీ వూళ్లో ఏం చేస్తున్నారు?" అని పలకరించాడు.

"గర్ల్సు హైస్కూలులో లెక్కలు ఎసిస్టెంటుని" అన్నది తాను.

అతనేం చేస్తున్నాడు? అన్న ప్రశ్న అడ్డింది. కాని తాను అడగలేదు. అతనే చెప్పాడు "నేను ఎ. వి. కాలేజీలో లెక్కలు లెక్చరర్ని."

"సంతోషం, మా చెల్లెలు, తమ్ముడు, కూడా అక్కడే ఫస్టియరు చదువుతున్నారు."

"పేర్లు ఏమిటి?" అని అడిగాడు.

"సీత, సుందరం."

"ఓ. నా డివిజనే. చాలా సంతోషం."

వీధిలో ప్రసంగం తనకేమీ నచ్చలేదు.

"లోపలికి రండి, అదే మా ఇల్లు" అని ఆహ్వానించింది.

వీధిగదిలో కూర్చోబెట్టి తాను లోపలికెళ్లి పావుగంటలో కాఫీ చేసి తీసుకొచ్చింది.

"వారింకా రానట్టుందే!" అన్నాడతను.

"ఎవరు?.. ఓ, నేనింకా కుమారినే" అన్నది తాను చిరునవ్వుతో. అతను ఆశ్చర్యంగా చూశాడు తనవైపు.

"అయితే..."

"ఆఁ... మేం ముగ్గురం ఉంటున్నాం" అంది.

"మీ శ్రీమతికూడా ఇక్కడే ఉన్నదనుకొంటాను, మీ ఇల్లు ఎక్కడో చెప్పారే కారు" అన్నది తాను కాఫీ కప్పు బల్లమీద పెడుతూ.

"ఇంకా అదేమీ లేదండీ, హోటల్లో ఉంటున్నాను" అన్నాడు. పాపం, ఇంకా పది వేల బేరం కుదర లేదు కాబోలు.

"ఇంకా ఎవరూ డేర్ చేసి ముందుకు రాలేదన్నమాట" అన్నది తాను వ్యంగ్యమైన చిరునవ్వుతో.

అతను కుంచించుకు పోయాడు.

"క్షమించండి శ్రీమణిగారూ, నన్నింకా మాటలతో శిక్షించకండి. అయినా పరమాన్నం తిన్న నోటితో మజ్జిగాన్నం తినలేము గానండి," అని "నేనింక వెడతాను" అని లేచాడు.

వీధి గుమ్మంలో శిష్యులు ఎదురైనారు. వాళ్లు ఆశ్చర్యపోయి, సంబాళించుకొని నమస్కారం చేశారు. అతను నవ్వుతూ వెళ్ళిపోయాడు.

"ఆయన మనింటికెందుకొచ్చారే అక్కా?" అడిగింది సీత.

"రేడియో స్టేషన్లో పరిచయమైనారులే" అంది ముక్తసరిగా.

(55-వ పేజీ చూడండి)

# మొదటి రోజు

బొమ్మిరెడ్డి

ఆనందరావు ఆఫీసుకి బయలుదేరాడు. ఆఫీసుకు పోతూ, యిక యీ జీవితకాలం, నేటినుంచి, యీ బాటపైన పొద్దునా సాయంత్రం తప్పనిసరిగా నడవాలికదూ! అనుకున్నాడు. ఇన్నాళ్లూ అతను, తన జీవితాన్ని ఖుషాసాగా, ఆనందంగా గడిపాడు. ఇక నేటినుంచి నిర్బంధ జీవితమేనా అని బాధపడ్డాడు. కాని వుద్యోగం దొరికినదన్న సంతోషం, కొత్త జీవితాన్ని చవిచూడాలన్న ఆరాటం, అతని హృదయంలో మొలకలెత్తుతున్న ఈ విచారాన్ని ఓ ప్రచండ మారుతంలా పెకిలించివేస్తోంది.

ఈనాడు కొత్తగా వుద్యోగంలో ఆనందరావు ప్రవేశిస్తాడు. అక్కడ అందరూ అపరిచితులే. అసలు వుద్యోగం చేయడమన్నదే అతనికి కొత్త. తనతో యితర్లు అన్న మాటలనుబట్టీ, పుస్తకాల్లోంచి, కథలవల్ల గ్రహించిన అంశాలను ఆధారంగా తీసుకొని, తన యీ మొదటిరోజున యెలా ప్రవర్తించాలో మననం చేసుకున్నాడు. ఇంకా అవే ఆలోచనలు.........ఆనందరావు ఆఫీసులో అడుగుపెట్టాడు.

ఎదురుగుండా సూపరింటెండెంటు పెద్దపులిలా కూర్చొని ఫైళ్లు తిరగేస్తున్నాడు.

అతని కిరుపక్కలా క్లర్కులు వంచిన తల ఎత్తకుండా రాసేస్తున్నారు.

ఆనందరావు అదురూ బెదురూ లేకండా, సైనికుడి ఫక్కీలో నడిచి వెళ్ళి, ఆయనముందు నిలుచుని గొంతు సవరించుకొని "గుడ్ మార్నింగ్ సార్" అన్నాడు. సూపరింటెండెంటు తల యెత్తి చూచి "కూర్చోండి" అని తన కెదురుగుండావున్న కుర్చీ చూపించాడు మర్యాదగా. ఆనందరావు ఆశ్చర్యపోలేదు. ఆవిధంగా జరుగుతుందని అతను మొదటే వూహించాడు. తన సూటునయినా చూచి కనీసం అంతమాత్రపు ఆదరణ చూపకపోడని అతడనుకున్నాడు. అందులో గ్రాడ్యుయేటు యింత తక్కువ జీతాని కొప్పుకొని, యెదుగూ బొదుగూ వుండని ప్రయివేటు ఫర్మ్‌లో ప్రవేశిస్తున్నాడంటే ఆమాత్రం చేయటం ఓ గొప్ప కాదనుకున్నాడు. అన్నీ అనుకున్నవిధంగా జరుగుతున్నందుకు, వుత్సాహం, ధైర్యం యెక్కువయి, యిక తానతనితో చెప్పదలుచుకున్న పరిచయ వాక్యాలను మనస్సులో వోక ఆర్డరుగా పేర్చి పెట్టుకొని, మొదలుపెట్టాడు:

"నన్ను ఆనందరావంటారు. మీ ఆఫీసులో వుద్యోగం చేయగల భాగ్యం అబ్బినందుకు నాకెంతో సంతోషంగా వుంది. నిజం చెప్పాలంటే ఆ అవసరం కల్పించిన మీకు నేనెంతో కృతజ్ఞుడ్ని." ఇక్కడ కొంచెం ఆగి ఆనందరావు సూపరింటెండెంటు ముఖంలోకి చూచాడు అతనిలో కలుగుతున్న మార్పులేమిటో గ్రహించాలని.

"ఆరి భడవా. నీవా! నీవని తెలిస్తే యీ కుర్చీ యిచ్చేవాడ్ని కానే!!" అన్నట్లు సూపరింటెండెంటు ప్రతిచూపు విసిరి యేదో అనడానికి పెదిమలు కదిపాడు. కాని ఆనందరావు మళ్ళీ అందుకున్నాడు:

"అవును నా ధోరణిచూచి మీరు ఆశ్చర్యపోతారని నాకు తెలుసు. నన్ను చూచీ, నా ఆకారం చూచి, 'నా ఆఫీసులో పనిచేయబోయే క్లర్కా నా' అనుకుంటారు. ఏమంటారు? నేనన్నది నిజమేనా"!! అని ఓ గొప్ప వక్త తన ప్రభావం ప్రజలపైన యేవిధంగా వున్నదీ నిర్ణయించుకోడానికి ఆగినట్లు కొంచెం నిలిచాడు. ఎదుటి ముసలి వ్యక్తి "అవును" అన్న అర్థంవచ్చే విధంగా, "సరేలే యిక కానీయ్" అని నిరసన తెలియజేసే విధంగా తలాడించాడు. "చూచారూ, యీనాడు వున్నదంతా వేషంలో నేవుంది. గౌరవించడమో అగౌరవించడమో యెదుటి వ్యక్తివేషాన్ని చూచే. సరికదా యిక యీనాటి యువకుల సంగతి యెలా వుందంటే వారొక నిర్ణీత స్టాండర్డునుంచి దిగలేరు. చేసేది క్లర్కు వుద్యోగమే కానీయండి, లేక ఆఫీసరుద్యోగమే కానీండి, జీతం చాలినా చాలకపోయినా తప్పనిసరిగా సూట్లు వేయాలి. అది 'బాడ్ యెకానమీ' అని మీ రనవచ్చు. కాని 'తప్పనిసరి' అని నేనంటాను." మళ్ళీ ఆనందరావు ఆగి "ఏమంటారు" అన్నట్లు నవ్వాడు. ముసలాయన కొంచెం తటపటాయించి మోహమాటపడి "అవునులే! కాలాను గుణంగా సర్దుకుపోవాలి; కాని........." అన్నాడు మధ్యలో ఆగిపోతూ.

"అదే! మీ రనబోయేది యీనాటి, నాలాంటి, యువకులు మీలాంటి, పాతకాలం వారిని మన్నించి గౌరవించరనే కదూ! మీ రలా అనుకోడం పొరపాటంటాను. మీరు లేందే మాకు అభివృద్ధిలేదు. మీరు దారి చూపందే మేం ముందుకి నడవలేం. అది మాకు తెలుసు. చూడండి! యిప్పుడు నేను మీ క్రింద పనిచేయడానికి వచ్చాను. మీతో సఖ్యంగా వుండి, మీ ద్వారా నా పనేమిటో తెలుసుకొని చేసుకుపోతూంటేనే గాని నేను యీ ఆఫీసులో వుండడానికి వీల్లేదు. మిమ్మల్ని పరిహసించటం గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్లుగా వుంటుంది. ఎవరితత్వ మెలావున్నా నామటుకు నేనలాంటి వాడిని కాను."

"తెలుస్తూనే వుందిగా" అన్నాడు ముసలాయన ముక్తసరిగా. అందులోని అర్థం, ఆ మాటల్లోని ధ్వని ఆనందానికి బోధపడలేదు. ఇంతవరకు తాను అనుకున్న విధంగానే జరిగింది. సూపరింటెండెంటు "తెలుస్తూనే వుందిగా" అని అంటాడనుకోలేదు. అందుకు బదులుగా "నీలాంటి బుద్ధిమంతులుండటం చాలా అరుదు" అని అంటాడనుకున్నాడు. అందువల్ల తానదలుచుకున్న మాటల విధానాన్ని మార్చవలసి వచ్చింది. కాలేజీ యూనియన్లో రెండేళ్ళు సెక్రటరీ, రెండేళ్ళు ప్రెసిడెంటు గిరీ వెలిగించిన ఆనందరావు, సమయానుకూలంగా, పరిస్థితులకు సరిపోయేవిధంగా మాటలు చెప్పడం నేర్చుకున్నాడు కాబట్టి అట్టే గాభరా పడకుండా తిరిగి అందుకున్నాడు.

"మీకు నా ప్రవర్తన వింతగా వుంది కదండీ అవును సుమారు ముప్పయి యేళ్ళనుండీ మీరు ఆఫీసులో వుంటూ, అనుభవాన్ని కూడబెట్టుకుంటూ పైకి వచ్చారు. ఆఫీసులో యేపని యెలాంటిదో, యెవరెలాంటివారో మీకు బోధపడుతుంది; కాని బయట ప్రపంచంలో జరుగుతున్న మార్పు మీకు తెలియకుండానే జరిగిపోతుంది. సుమారు నలభైయేళ్ల క్రితం కాలేజీ వదులుకున్న మీకు, యిప్పుడు కాలేజీలలో

(55-వ పేజీ చూడండి)

# కుర్చీలో మూన్నిరాగం

"ఆరుద్ర"

మన ఎసెంబ్లీ సభ్యులకు నిరుపేదలంటే ఎంత కరుణ. ఆంధ్రలోని బంజరు భూములన్నీ స్వాధీనపర్చుకొని నిరుపేదలకు పంచిపెట్టాలని ఏకగ్రీవంగా తీర్మానించారు. ఏకగ్రీవంగా, అంటే ఒక్క గొంతుకతో ఇంత చక్కటి నిర్ణయానికి రావడం చూస్తే మన ఎసెంబ్లీ సభ్యులు ఎంత మారిపోయ్యారు, ఎంత సంఘీభావంతో ఉంటున్నారని ముచ్చటేస్తుంది. ఏమంటే ఈ బంజరు భూముల తీర్మానం ఐక్యకంఠంతో రావడానికి ముందు జీతాబోగుల తీర్మానం స్పీకరుగారి కేస్టింగువోటుతో నెగ్గవలసిన పరిస్థితి ఏర్పడింది. ఇంత పరస్పర వ్యతిరేకత, ఉత్తర దక్షిణ ధ్రువాల లాంటి విభిన్నాభిప్రాయాలు ప్రభుత్వానికి ప్రతిపక్షానికి ఉన్నప్పుడు హఠాత్తుగా అసెంబ్లీవాళ్ళంతా ఏకగ్రీవంగా ఒక చక్కని విషయంపై తీర్మానం చెయ్యడం ముదావహంకదా. కానీ ఈ ఏకగ్రీవ తీర్మానంలో ఒక లోగుట్టు ఉందని ఎవరో కిట్టనివాళ్ళు వ్రాశారు. జీతాబోగుల బిల్లుపై కాస్టింగ్‌వోటుతో గండం తప్పించుకొన్న ప్రభుత్వం బంజరుభూముల సమస్యమీద తమకు ఓటమి తప్పదని గ్రహించారట! అందుకే ప్రతిపక్షం ప్రతిపాదించిన తీర్మానాన్ని మంత్రివర్గం కూడా ఆమోదించవలసి వచ్చిందట. రామ! రామ! మన మంత్రులకి జయాపజయాలమీద ఖాతరు ఉందిటండీ జీతాల బిల్లుతో ఓడిపోయాక మన మంత్రులు ఏమైనా ప[illegible]ంచుకొన్నారా! జిల్లాబోర్డుల బిల్లులో గెలిచారని విర్రవీగారా! బిల్లులపైనే గెలుపు ఓటమి అనేవాటి విషయంలో ప్రభుత్వానికి ఈరకం వేదాంత దృక్పథం ఉన్నప్పుడు తీర్మానాలతో విజయ పరాజయాలను లెక్కపెడతారా? కిట్టనివాళ్ళు రాసిన మాటలు సుతరాం కిట్టకే సుమండీ. అంతగా ఓడిపోతాం అని భయపడితే హైకోర్టు తీర్మానం విషయంలో ప్రతిపక్షానికి మంత్రివర్గం ఎందుకు తలఒగ్గలేదు ఒక్క వోటుతో 'హైకోరు తీర్మానం సవరణ'లో ఓడిపోయినా ప్రభుత్వం ఏం చేస్తున్నదో తమకు తెలిసినదే. అయినా ఒకందుకు ప్రభుత్వాన్ని మెచ్చుకోవాలి. అప్పుడప్పుడు ఏకగ్రీవతని చూపెట్టడానికి సంసిద్ధత ప్రదర్శిస్తున్నది.

ఇంతకీ ఇవాళ పదవిలో ఉన్నవాళ్లు ఓడిపోతే రేపు మళ్ళా వాళ్ళే అధికారంలోకి రారని ఏం నమ్మకం. ఈజిప్టు సంగతి చూడండి.

* * *

నజీబు రాజీనామా,
స్వగృహంలో అతడి నిర్బంధం.
విప్లవసంఘంలో కల్లోలాలు.
నజీబు పదవీస్వీకారం.

నాలుగురోజుల్లో ఓడలు బండ్లయినాయి మళ్లా బండ్లు యధాప్రకారం ఓడలయిపోయినాయి నజీబు పదవీచ్యుతుడు కాగానే అతడిపటాలు, ఫొటోలు అన్నీ లాగి పారేసేరట. పదవీస్వీకారం మళ్లా చెయ్యగానే ఆ పటాలు, ఫొటోలు మళ్ళీ ఎక్కడివక్కడ తగిలించేశారట. ఇలాంటిఫొటోలుమార్చడం ఇండియాలో జరక్కుండా ఉండాలని వెయ్యిదేముళ్లకి మొక్కుకోవాలి. పటాలు ఫొటోలు తీసెయ్యడం, మళ్ళా తగిలించడం చాలా కష్టం. ఒకఫొటో గోడకి తగిలించడానికి మళ్ళా తీసెయ్యడానికి, తిరిగి తగిలించడానికి కలిపి ఒక నిముషం పడుతుందనుకోండి. ముప్ఫయిమూడుకోట్ల భారతీయులూ ఇలాగ ఫొటో తగిలించి, తీసేసి, మళ్లా తగిలించడానికి ముప్ఫయిమూడుకోట్ల నిముషాలు వృధా చేస్తారు. అంటే ఏభయి అయిదు లక్షల గంటలు వేస్టు అవుతుంది. అంటే రెండులక్షల ఇరవై తొమ్మిది వేల నూట అరవై ఆరురోజుల పదహారుగంటలన్నమాట. అనగా ఏడు వేల ఆరువందల ముప్ఫయి ఎనిమిది నెలల ఇరవై ఆరురోజుల పదహారు గంటలన్నమాట. దీన్ని సంవత్సరాలలోకి మార్చితే ఆరువందల ముప్ఫయి ఆరు సంవత్సరాల ఆరు నెలల ఇరవైఆరురోజుల పదహారు గంటలన్నమాట. నాయకుడి ఫొటో మార్చడానికి మన దేశం సగటున ఆరుశతాబ్దాలు తీసుకొంటుంది. మన దేశీయులు వస్తుతహాకూడా ఒకసారి నాయకుడు అనుకొన్నాక కొన్ని శతాబ్దాలదాకా అతడి ఆరాధన మానెయ్యరు. దీన్ని మూఢనమ్మకం అంటారో, వారసత్వం అంటారో ఏమంటారో మీరే తేల్చండి.

* * *

కుంభమేలా దుర్ఘటన గురించి చర్చిస్తూ శ్రీ మన్నె ప్రసాద్ గారూ, శ్రీజిత్ టాండన్ గారూ, కట్టూ పంతులు గారూ మూఢనమ్మకాల గురించి ముచ్చటించారు. మహారాజరాజశ్రీ కట్టూ పంతులుగారు కుంభమేలా వేళప్పుడు గంగలో తాము తిరగానే తమకూ తమ తరతరాల పూర్వీకులకూ ఎడతెగని సంబంధం ఏర్పడుతుందన్నారు. వాస్తవమే. ఆబ్దికాలు పెడుతున్నప్పుడు గాని, వర్ధంతులు జరుపుతున్నప్పుడు గాని పూర్వీకులకూ మనకూ మానసికంగా రాకపోకలు జరుగుతాయి. ఆ విషయం గురించి మనం అట్టే తర్కించక్కర్లేదు. కుంభమేలా దుర్ఘటనకి కారణమైన "స్వాములవారి పాదరేణువులని శిరసావహించడం" అనే పిచ్చినమ్మకం ఎంతవరకు అవసరం అనేది కొద్దిగా ఆలోచించవలసిన విషయం.

"కలడు కలండనెడివాడు కలడో లేడో" గాని మన కళ్ళెదుట, కట్టెదుట ప్రత్యక్ష దైవం ఒకడు లేకపోతే ఈ జాతీయ అంతర్జాతీయ ఆర్థిక పారమార్థిక సాంఘిక రాజకీయ క్లిష్ట కష్టపరిస్థితులలో మనశ్శాంతి దొరకడం మహా చెడ్డ చిక్కుపని. అనుకొన్నవి జరగనప్పుడు, జరిగినవి అనుకోకుండా జరిగినప్పుడు, ఆశలు ఫలించనప్పుడు, ఎటుచూచినా చీకటిలాగ విచారం క్రమ్మినప్పుడు, దివ్యజ్యోతిలాగ మనకి వెలుగు చూపించే మహావ్యక్తి అవసరం. అతడి అడుగుజాడల్లో నడిచి ఆనందం, సంపాదించిందికి, అష్టకష్టాలస్థానే అష్ట అయిశ్వర్యాలను పొందడానికి ఆశపడడం సహజమే. గాని దివ్యజ్యోతి అనుకొనే మహావ్యక్తిలో దివ్యత్వం గాని, మహత్వం గాని చాలా సందర్భాలలో చాలా అరుదుగా ఉంటుంది. మునిగిపోతున్నవాడు గడ్డిపోచను పట్టుకొన్నట్టు కష్టాల్లో ఉన్నవాడు గుడ్డిదీపాన్నే దివ్యజ్యోతిగా ఎంచుకొంటాడు

అందుకే సగటున అయిదేసి సంవత్సరాలకి మనకో కొత్త 'బాబా' అవతరిస్తూ ఉంటాడు. కొత్తస్వాములారు విజయం చేస్తూ ఉంటాడు. కొత్త 'ధన్వంతరి' వెలుస్తూ ఉంటాడు. ఆ 'బాబా' గారి నామస్మరణ చేస్తే సర్వపాపాలూ పోతాయి. ఆ స్వాములారి సేవచేస్తే స్వర్గద్వారాలు తెరచుకొంటాయి. ఆ 'ధన్వంతరి' చేతి మూలికలు పుచ్చుకొంటే సకలరోగాలు చటుక్కున మాయమవుతాయి. వేదనలో బాధల్లో దరిద్రంలో విసిగి వేసారిన ప్రజలు ఈరకం మహాపురుషుల సంగతి

వినగానే వాళ్ళని నమ్మేస్తారు. వాళ్ళకి తమ ఆత్మల నమ్మేస్తారు. అక్కడదాకా సహజమే. గాని చిత్రం ఏమిటంటే అలా నమ్మినందువల్లా ఆత్మలను అమ్మినందువల్ల తమ బాధలు తగ్గినట్టూ తమ వ్యాధులు పోయినట్టూకూడా నమ్మకం కలుగుతుంది.

సుమారు ఆరేడేళ్ళ కిందట చెన్నపట్నంలో తంబుచెట్టివీధి మొగదల, హైకోర్టు కెదురుగా చర్చికి కుడిపక్క అరుగుమీద ఒక లావుగా పొట్టిగా ఉండే గడ్డాలవ్యక్తి నిల్చొనేవాడు. మాసిపోయిన జుబ్బా, నలిగిపోయిన లుంగీ - మాటలు కూడా సరిగ్గారావు. ఆ వ్యక్తిచుట్టూ జనం చేరేవారు. ఆ జనంలో అన్నిరకాలవాళ్లూ ఉండేవారు. అన్నిమతాలవారూ ఉండేవారు. ఆ వ్యక్తికి తమ జబ్బులు చెప్పుకొనేవారు. అతడు అది విని, వాళ్ళలో ఒకొక్కణ్ణి తన ముందుకు పిలిచేవాడు. జబ్బగలవాడి కుడిచేతిని ఎత్తమనేవాడు. "అమా అమా" అంటూ రామశబ్దం స్ఫురింపజేస్తూ జబ్బకింది ఏదో నరం పట్టుకొని లాగేవాడు. అలా లాగించుకొనే వాడి ముఖం మీది కండరాలన్నీ ముడుచుకుపోయేవి. కళ్ళు మూసుకుపోయేవి. కన్నీళ్ళు వచ్చేవో లేదో నాకు తెలియదు. ఆ ముఖాలలో బాధ మట్టుకూ కనిపించేది. గాని గడ్డాల వ్యక్తి ఆ నరం లాగిన మరుక్షణంలో మట్టుకు లాగించుకొన్నవాడి పెదిమలమీద చిరునవ్వు కనబడేది. కళ్ళల్లో ఆనందం - ముఖం నిండా తృప్తి వెల్లివిరిసేది. తనకున్న వ్యాధి దీర్ఘమైనా, హ్రస్వమైనా అది వెంటనే పోయిందని నమ్మి - గడ్డాలవ్యక్తికి నమస్కరించి, తృణమో పణమో సమర్పించి వెళ్లిపొయ్యేవాడు. ఈ గడ్డాలవ్యక్తిని తమ తమ ఇళ్ళకు తీసుకెళ్ళడానికి టాక్సీలు తెచ్చేవారు. పెద్దపెద్ద ఖరీదైన కారులు తెచ్చేవారు. తీసుకెళ్ళి ఇళ్ళల్లోఉన్న ఆత్మీయుల రుగ్మతలని బాగుచేయించుకొని, మళ్ళా ఆ వీధి మొగదలలోనే అతణ్ణి కారులో విడిచిపెట్టేవారు.

ఇది రోజూ, నేనూ, నా స్నేహితుడూ చూసేవాళ్ళం. నా స్నేహితుడు ఆ వ్యక్తిని చూసిన మరుక్షణమే "వీడా!" అని పెదవి విరిచాడు. "ఏం" అని అడిగాను. నేను విజయనగరంలో చదువుకొనేరోజుల్లో వీణ్ణి నాకు తెలుసు. వీడు సగం పిచ్చివాడు. మా అయోధ్యమైదానం దగ్గర తిరుగుతూ ఉండేవాడు. మా ఫుట్‌బాల్ టీములు ఏదేనా ఊరెళ్ళుతూఉంటే వాటితోబాటు వెంట పడేవాడు. మాకు సోడాలు - గట్రా అందించుతూ ఉండేవాడు. కొన్నాళ్లు పోయాక వీడిని వీళ్ళవాళ్లు 'దేముడు' అన్నారు. ఆ దెబ్బతో వీడు దేముడయి పొయ్యాడు" అని నా స్నేహితుడు చెప్పాడు. దేముడి పూర్వకథఏమైనాగాని ఆరోజుల్లో చెన్నపట్టంలో కనీసం ఒక వెయ్యిమందికేనా అతడు తాత్కాలికరోగ నివారణ చేశాడు. కొన్ని నెలలపాటు ఒక వెలుగు వెలిగాడు. ఆ తరవాత నాటినుంచి, నేటిదాకా అతడు నాకంట బడలేదు.

ఇలాంటి "దేముళ్ళు" మనకి నెల కొకడు ప్రతీఊళ్లో కనబడతాడు. నెహ్రూగారు సెలవిచ్చినట్టు మనదేశంలో మూఢనమ్మకాలున్నాయి. అందుచేత వీళ్లు ఇలా పుట్టుకొస్తున్నారు అనుకోడం సమంజసమే గాని మూఢనమ్మకాలు లేని ప్రదేశం ఎక్కడుంది. ఏ దేశంలో ఉంది. సభ్యత, నాగరికత పెరిగిన అమెరికాలోనే ఇలాంటి దేముడొకడున్నాడు. కిందటివారం 'బ్లిట్జ్'పత్రిక అతడిగురించి ప్రచురించింది.

అతడు పూర్వాశ్రమంలో తోటమాలి - ప్రస్తుతం దేముడు. నీగ్రోవాడు. వయస్సు ఎంతైనా నలభైఏళ్ళవాడిలాగ ఉంటాడు. లక్షలకొద్దీ తెల్లా నల్లా శిష్యు లున్నారు. పాతికేళ్ళాయి దేముడిలాగ ప్రాక్టీసు పెట్టాడు. తనకి కాణీ ఆస్తి లేదంటాడు. అయినా కోటీశ్వరుడు. క్షౌరశాలలు, పానశాలలు, హోటేళ్లు, బడులు, గుడులు, బళ్లు ఎన్నెన్నో ఉన్నాయి. దమ్మిడీ ఇన్‌కమ్‌టాక్సు కట్టడు. న్యూయార్కులో 'న్యూసెన్సు' గా పరిణమించేడని ఎప్పుడో కేసు పెట్టారు. జడ్జీ ఇతణ్ణి శిక్షించాడు. గాని శిక్షవేసిన మూడోరోజున అంతదాకా ఆరోగ్యంగా ఉన్న జడ్జీ చచ్చి ఊరుకొన్నాడు. దేముణ్ణి విడిచి పెట్టారు. విడిచిపెట్టక చస్తారా...? దేముడికి శిష్యవర్గం పెరిగింది. ప్రభ హెచ్చింది. అతడూ, అతడి నిజభక్తులు కలకాలం బ్రతుకుతారట. (అతడి శిష్యవర్గంలో కొంతమంది చచ్చిపోయారుగాని వాళ్ళు తన నిజభక్తులు కారని దేముడన్నాడు) అతని శత్రువులు, విరోధులు చచ్చిపోతారట. అతడి శాపాలు తిరుగులేనివి.

ఈదేముడు అమెరికాలో ఇంతగా వెలగడానికి కారణం ఏమిటి? ఒకటే కిటుకు - తాను దేముణ్ని అని అతడు నమ్మిన తొలిరోజుల్లో శిష్యవర్గానికి అతడు సుష్టుగా తిండిపెట్టాడు. అతడి బోధనలు వినడానికి వచ్చినవాళ్లు ఎంతమందైనా సరే వాళ్ళందరికి షడ్రసోపేతంగా కడుపునిండా భోజనం పెట్టేవాడు. ఇవ్వగలిగినవారు ఎనిమిది సెంటులు దక్షిణ ఇచ్చేవాళ్ళు - లేనివాళ్లు తిండితిని, బోధ వినిపోయేవారు. శిష్యవర్గం పెరుగుతూ వచ్చేసరికి శ్రీమంతులైన శిష్యులు ఖర్చులు భరించేవారు. దేముడి సంతర్పణలు - అనాథల్ని అన్నార్తులని ఆకర్షించేవి. దేముడి ప్రబోధంకూడా ప్రజ్వరిల్లింది.

స్వాములవార్లు, 'బాబా'లు దేముళ్లు విజయవంతం కావడానికి సంతర్పణలే నిజంగా కారణంకాదు. అనేక విధాల అసంతృప్తితో ప్రజలు బాధపడుతున్నంతకాలం ఆ స్వాములవారు బాబా, దేముడు ఏదో విధంగా తృప్తిని కలిగించితే ప్రజలు నమ్మక మరేం చేస్తారు. ఆరేడేళ్ళ కిందట, ఒరిస్సాలోనే అనుకుంటా, ఎవరో సర్వరోగ నివారణంచేసే మూలికలు పంచిపెడుతున్నాడంటే లక్షలకొద్దీ కుష్టురోగులు, భీకరవ్యాధులతో బాధపడేవాళ్ళు దీర్ఘరోగాలతో వేగుతున్నవాళ్లు ఆ వూరు చేరుకోడం, ఆ మూలికలు బూటకం అని తెలియడం, ఇంతమంది రోగిష్ఠులు ఒక చోట చేరటంవల్ల కొన్ని అంటువ్యాధులు వ్యాపించడం జరిగింది. దీనికి ఎవరు బాధ్యులు? ఆ మూలికలు ఇచ్చేవాడా? పాపం పుచ్చుకొనేందుకు వచ్చినవాళ్ళా?

డబ్బు ఇచ్చుకోలేనివాళ్లు, డబ్బు ఖర్చు పెట్టినా బాధలు తీరనివాళ్ళు, రోగాలు పోనివాళ్లు ఎవరో ఒకరికాళ్ళు పట్టుకోక తప్పదు. వాళ్ళకి సాములార్లు బాబాలు దేముళ్ళు అందుబాటులో ఉంటారు. ఆ మహనీయుల పాదరేణువుల తలదాల్చినంత మాత్రాన జన్మ తరించుతుందని అణగారిన ఆర్తులు, అమాయకులు భావిస్తారు. ఆత్మశాంతి దొరుకుతుందనుకుంటారు మూఢనమ్మకమే. గాని దీన్ని నెహ్రూలు, టాండన్‌లు కట్జూలు చర్చించినా, మీరూ నేనూ ఖండించినా, సమర్థించినా లాభం లేదు. ఆ మూఢనమ్మకానికి మూలకారణమైన బాధలని తొలగించితేగాని సమస్య పరిష్కారం కాదు ప్రజలు దరిద్రులు కానప్పుడు, వాళ్లకి ఆకలిబాధ లేనప్పుడు, అత్యుత్తమ వైద్యసహాయం ఉచితంగా లభించినప్పుడు అనేకానేక ఇతర బాధలు లేనప్పుడు ఈ మూఢనమ్మకాలకు తావుండదు. ఈతిబాధలు లేని ఇండియాలో అయిదేళ్లకో కొత్తబాబా అవతరించడు, సంవత్సరానికో స్వాములారు దాపురించడు. అటువంటి ఇండియాను నిర్మించడానికి నెహ్రూలు, టాండన్‌లు కట్జూలు యథాశక్తి పాటుపడుతూనే ఉన్నారుగాని ఎన్ని చెంబులతో తోడితే ఈబాధాసరోవరం ఎండుతుంది? చెంబులకి బదులు బొక్కెనలు బాల్చీలు పట్టుకొంటే మట్టుకూ సాధ్యమా. ఏ యంత్రం ఉపయోగిస్తే ఈ దారిద్ర్య తటాకాన్ని ఎండబెట్టి దానినిండా ఆనందజలాలని నింపవచ్చో నెహ్రూగారికి తెలియకనా? తెలుసు. ఆయన వాడటంలేదు. అలా వాడనంతసేపూ కోరికలు తీరని ప్రజలకోనేట్లో మూఢనమ్మకాల దోమలున్నాయని నెహ్రూగారు ఎంత వాపోతే ఏంలాభం? ★

శ్రవ్యనాటిక:

# చిన్న చూపు

విజయ :(వస్తూ) ఏవిఁటి! ఎప్పుడూ లేంది ఈవాళ తెలుగు నవల చదివేస్తున్నారు?

వాసు: (నిర్లక్ష్యంగా) ఆఁ, నీ ఆశ్చర్యం తర్వాతగాని, ముందు ఆ యిచ్చేదేదో త్వరగా యివ్వు.

[కప్పులు చప్పుడు]

విజయ: ఆఁ, సాయంకాలం త్వరగా వస్తారు కదూ?

వాసు : ఏం?

విజయ: మినర్వాలోకి కొత్త సినిమా వచ్చింది.

వాసు: చూడొచ్చులే.

విజయ : చివరి రోజువరకు అలానే అంటూ వుంటుంటారు; ఆవాళ మాత్రం ఎవరికీ చెప్పకండా ఒక్కరూ వెళ్ళి చూసొచ్చేస్తారు.

వాసు : అయినట్టేనా ఆ దండకం? (సైకిల్ బెల్ వాగిస్తాడు.)

విజ : ఆఁ, అవుతుంది!

వాసు : సంతోషించాంలే - యిక లోపలికి వెళ్లు (సైకిల్ బెల్ క్రమంగా తగ్గుతుంది)

*  *  *

[ఆఫీసులో గుమస్తాల నవ్వులు, మాటలు]

రమణారావు : ఏరా వాసూ! నిన్న సాయంకాలం ఆఫీసరు నీమీద ఫైరై పోతున్నాడు - ఏవిఁటి కథ?

వాసు: ఏముంటుంది? ఆయన చెప్పినట్టు చెయ్యావని కడుపుమంట.

మరో వ్యక్తి : అసలు జరిగిన సంగతేవిఁటి?

వాసు : ప్రొద్దుట అర్జంటంటూ ఓ బండెడు కాగితాలు ముందు పడేశాడు; మధ్యాహ్నం కాఫీకైనా బయటకెళ్లకుండా టైపు చేసి నాలుగింటికి అందించాను. మెచ్చుకుంటాడనుకున్నాను. అబ్బే! మరో గంట టైముందని మరో వాగన్ పేపర్లు టైపు చెయ్యమన్నాడు.

ఓగొంతు : అంతే బ్రదర్, ఈ ఆఫీసులు భస్తే కష్టాన్ని గుర్తించవు.

రమణారావు : ఊఁ తర్వాత?

వాసు : తర్వాత యింకేముంది? నో సార్. ఇప్పటికే వొళ్లంతా నొప్పి పట్టుకొంది, కావాలంటే రేపు చేస్తానండి తప్పక, అన్నాను. ఇంతేతున తేచాడు. నిజం చెప్పొద్దూ? వొళ్లు మండుకొచ్చింది.

ఓగొంతు: అంతే బ్రదర్, ఈ ఆఫీసులు భస్తే కష్టాన్ని గుర్తించవు.

రమ: ఊఁ తర్వాత?

రవణ: మొన్నటిలా ఎదిరించావులాగుంది?

వాసు : అంతే!

రవణ : ఐతే ఈవాళ మరో వార్నింగ్ ఇష్యూ అవడం ష్యూరన్నమాట?

వాసు : అవనివ్వవోయ్, ఎవడికి లెఖ్క? ఈ డెబ్భయిరూపాయల ముష్టి ఉద్యోగానికి ఆత్మాభిమానాన్ని చంపుకుంటామా?

రవణ: చంపుకోవాలిరా, బాబూ, చంపుకోవాలి.

వాసు : నీ కది సాధ్యమాతుందేమో నాకుమాత్రం సాధ్యంకాదు. ఇంతా చేసి ఈ మూడేళ్ల టెంపరరీ ఉద్యోగానికి ముప్పయిలక్షల తిట్లు రోజూ యెవడు తింటాడోయ్?

## యస్. ఆర్. నంది

రవణ : తర్వాత కన్ఫరమ్ అవొచ్చుగా?

వాసు : అప్పటికు మాసుకోవచ్చులే, అందాకా...

ఓగొంతు. ఆఫీసరొస్తున్నాడు, ఊరుకో వాసూ.

[అన్ని గొంతుకలూ తక్కున ఆగిపోతై. బూట్లచప్పుడు.]

ఓగొంతు : గుడ్ మార్నింగ్ సార్.

ఆఫీసర్ : గుడ్ మార్నింగ్.

రవణ : నమస్కారమండి.

ఆఫీసరు : నమస్తే. [బూట్ల చప్పుడు క్రమంగా తగ్గుతుంది]

వాసు : [నవ్వుతూ] అంత దొంగదండాల బ్రతు కెందుకోయ్?

రవణ : అందరూ నీలాంటి రాకుమారులు కారు, నాయనా!

వాసు : ఇదో నటన.

ప్యూన్ : [వస్తూ] మిమ్మల్ని పిలుస్తున్నారండి.

వాసు : [మెల్లగా] ఇలా వచ్చాడో లేదో అప్పుడే తయారు...ఆఁ...వస్తు...

*  *  *

ఆ : నిన్న విడిచిపెట్టిన పేపర్లు మధ్యాహ్నానికి టైపు చెయ్యాలి. మోస్ట్ అర్జంట్.

వా : [నసుగుతూ] ఇవ్వన్నీ ... మధ్యాహ్నానికల్లా...కష్టమండి...

ఆ : అందుకే నిన్న యిచ్చాను.

వాసు : పోనీ... నేను...రమణరావు...

ఆ : ఆయనకు మరో వర్కు యిచ్చాను; వెళ్ళండి.

*  *  *

వా : అయినంతవరకు చేస్తాను; తర్వాత చూస్తాను, ఏంచేస్తాడో?

ర : ఎందుకురా వాసు, పెద్దరాళ్ళకింద చేతులు పెట్టడం. నీకు కష్టమయితే నాకు సగంయివ్వు, హెల్ప్ చేస్తాను.

వాసు: నో, థ్యాంక్స్, ఛార్జిషీటు ఇష్యూచేస్తే సంజాయిషీ చెప్పేపాటి తెలివి వుందిలే.

రవ: సరె నీ యిష్టం.

(కొంతసేపు టైపురైటర్ శబ్దం)

ప్యూన్: పిలుస్తున్నారండి.

*  *  *

ఆఫీసరు: ఆఁ, అయిపోయినట్టేనా?

వా: లేదండి...ఇంకా సగంవున్నాయి.

ఆ: మంచిది; వాటిని యిలా తీసుకరండి.

వా: సాయంకాలంలోపున ఫినిష్ చేసి యిస్తానండి.

ఆ: లాభంలేదు ... అందుకే నిన్న యిచ్చాను; మీరు గడియారం చూసుకొని పనిచేస్తుంటే ఇహ నేనేం ఈ ఆఫీసుని మెన్టెయిన్ చేస్తాను? ఆ వోర్నింగేదో వస్తే మీరే సంజాయిషీ...

వా: థ్యాంక్స [ఫేడౌట్]

*  *  *

[రోడ్డుమీద రిక్షాలు, కార్ల శబ్దాలు- మధ్య సైకిల్ బెల్ చప్పుడు]

ఒగొంతు : ఒరే...వాసూ...వాసూ...

వా: [బెల్ కొట్టడం ఆపి] ఎవరు?

గొంతు: [వస్తూ] నీ కోసం ఆఫీసుకి వస్తున్నా.

వా: ఎందుకు?

గొంతు: ఇదుగో ఈయన రామచంద్రరావుగారు. నీకు తెలిసేవుంటుంది: గొప్ప రచయిత.. ఇతనేనండి మా బ్రదర్నా వాసుదేవరావు..

రచయిత: నమస్తె. గోపాలంగారు నన్ను

అతిగా పొగుడుతున్నారుగాని, నిజానికి నాలో ఏముందండి గొప్పతనం ?

గోపాలం: వీరిది ఏలూరు. ఈమధ్య ఓ పత్రిక స్థాపించాలని ఊరూరా చందాల కోసం తిరుగుతున్నారు—

వా: అలాగా!

రచ: మీ ఆఫీసులోగూడా మీ తరఫు నించి...

వా: కష్టం మాష్టారు.

గోపా: పోనీ ట్రైచెయ్యకూడదు ?

వా: లాభం వుండదు.

గోపా: పోనీ.. నువ్వయినా కనీసం ఓ పది...కన్‌ట్రిబ్యూట్...

వా: నాకు తెలుగంటే అంత యిష్టం లేదు.

రచ: చంపేశారు; నిజానికి తెలుగులో వున్నంత సాహిత్యం మిగతా భారతీయ భాషల్లో లేదంటే అతిశయోక్తి కాదు.

వా: [నవ్వి] స్వాభిమానం అలా అని పిస్తుంది లెండి...మీరేదో పనిమీద వెడు తున్నట్టున్నారు, మరిక శెలవా?

రచ: ఎంతమాట!

గో:[నిట్టూర్పు] ఊఁ...రాత్రి భోజ నానికి వస్తానని విజయతో చెప్పాను. మరిక రానని చెప్పేసెయ్. కోచీకి వెళ్ళిపోతాను.

వా: ఏం?

గో: వచ్చినపని అయిపోయిందిగా?

వా: సరే...గుడ్ బై [ఫేడౌట్]

రచ: చాల విచిత్రమయిన మనిషిలా వున్నారండి మీ బావగారు!

గో:మనిషిదో మన తత్వం మదిలో వేసు- నుకోవండి

[సైకిల్ బెల్]

విజయ: [తలుపుతీసి] ఈవాళ త్వరగా రమ్మన్నందుకులాగుంది యింతాలస్యం చేసేశారు? అన్నట్టు సాయంకాలం మా అన్నయ్య వచ్చాడు.

వా: కలిశాడు.

వి: రాత్రి భోజనానికి యిక్కడికే రమ్మనమని చెప్పాను.

వా: రాలేనని చెప్పమన్నాడు.

వి: ఏం?

వా: ఎందుకో నాకేం తెలుసు?

వి. మీరేం అడగలేదూ?

వా: అనవసర మనుకున్నాను.

వి: వెనక ఎవరో స్నేహితుడు గూడ వున్నారు-తప్పకండా వస్తానని చెప్పాడు!

గో: పిల్లేదమో లే.

వి: బాగుంది! ఈ వండిన వంటంతా యేం చెయ్యాలి!

వా: ముష్టివాళ్ళకి వేసెద్దువుగాని, ముందు స్నానానికి నీళ్లు పెట్టు.

*　*　*

(విరామ సూచనగా జంత్ర సంగీతం- తలుపు తట్టిన శబ్దం)

వి: ఎవరు? [తలుపు తెరచిన చప్పుడు] అరె! నువ్వా! ఇదే రావటమా అన్నయ్యా?

గో: అవునమ్మ; మధ్యాహ్నం పాసింజరులో వచ్చాను ఆఫీసుపనిమీద.

వి: ఆఁ, తర్వాత మాటాడుకోవచ్చు గాని, ముందు స్నానానికి లే.

గో: నాకో నిమిషం టైమున్నా లేదు; ఈకోచీకే వెళ్ళిపోవాలి...వాసు ఏడి?

విజయ: ఆఫీసునించి యింకా తిరిగి రాలేదు.

గోపాలం: అదేవిఁటి! ఆఫీసునించి యెప్పుడో వచ్చేశాడట!

వి: అయితే మధ్యదార్లో ఎవరో కలిసుంటారు – బాతాఖానీకి.

గోపాలం: ఇక బాతాఖనీయే శరణ్యంలే.

విజయ: ఏం?

గో: అయినా కాకపోయినా వీడి కెందుకు చెప్పమ్మ పెద్దరాతికింద చేతులు పెట్టడం! ఇప్పటికి సవాలక్ష రిపోర్టులు వచ్చాయి; పోని ఓనాడు కాకపోతే ఓనాడైనా బుద్ధి తెచ్చుకోనక్కర్లా? ఎప్పుడూ చిన్నపిల్లడిలా ఒకటే తీరా?

వి: అసలు ఏమయిందేవిఁటన్నయ్యా?

గో: ఏమవుతుంది? జరగవలసినతంతంతా జరిగిపోయింది. ఎన్నోసార్లు వాణ్ణి హెచ్చరించాను: ఆఫీసర్లతో జగడమెందుకురా అని; విన్నాడా? పోనీ ఛార్జిషీటు వచ్చినప్పుడైనా సరయిన సంజాయిషీ చెప్పుకోవద్దు! దానిమీద కవిత్వమంతా ఒలకబోసుకొంటే ఇకస్మైనాఉద్యోగమనుకున్నాడా, లేక తమాషా అనుకున్నాడా?

వి: అయితే ఉద్యోగానికేమైనా...

గో: ఏమైనా ఏవిఁటి ? ఊడిపోతుంది రెండుమూడురోజుల్లో.

వి: హా!

గో: అసలే అది టెంపరరీ ఉద్యోగం. ఏదో అలా యిలా ఆఫీసరుదగ్గర మంచిపేరు తెచ్చుకొని అందులో పెర్మనెంట్ అవడానికి ప్రయత్నించాలా – అహాఁ – అది కాదు, తనకేదో పెద్ద ఆత్మాభిమానమంటూ ఏడిసిందని, ఎదిరిస్తే ఎవరూరుకుంటారు?

వి: నువ్విది తప్పించడానికి ప్రయత్నం చెయ్యలేవా అన్నయ్యా?

గో: లాభం లేదమ్మ, చెయి దాటిపోయింది. పై ఆఫీసరుకూడ ఎర్రసిరాతో రాసేశాడు. అయినా యిప్పుడీ వుద్యోగం పోతే వెనక ఏముంది చెప్పు వీడికింతగర్వం? ఏంచూసుకొని యింత లెఖ్ఖలేనట్టు తిరగడం?

[బయట సైకిల్ బెల్ వినిపిస్తుంది]

వి: అదుగో ఆయనే వచ్చారు.

గో: రానియ్...నీమీద రిపోర్టంతా చూశానురా వాసు.

వా: మంచిది, ప్రచారం మిగిలిపోయిందా ?

వి: ఏవిఁటండీ ఆ అడ్డదిడ్డపుమాటలు— తిన్నగా చెప్పరేరు ?

వా: ఓహో! ఈ విషయం అప్పుడే నీవరకూ వచ్చేసిందీ? [గోపాలంతో] ఇక నీకు తృప్తియింపనుకుంటాను.

గో. నీ ఉద్యోగంపోతే నాకెందుకురా తృప్తి? నీకు ఎప్పటినించో వద్దువద్దని చెబుతున్నా వినిపించుకోలేదు. పిక మీదికి

## ★ చిన్న చూపు ★

తెచ్చుకున్నావ్! అయినా నీ కెందుకు చెప్పరా ఆ కొండలతో ఢీకొడాలు?

వా: అలా అని నాకు చాలామంది బుద్ధి చెప్పొచ్చారు. పాపం! వాళ్ళకేం తెలుస్తుంది? వాళ్ళ సైకాలజీప్రకారం నొక్కి న పేను తత్వాన్ని కలిగుండా లంటారు.

గో: అలా అని ఏ మూర్ఖుడూ సలహా యివ్వడు. కొస్త చిన్నా పెద్దా అంతస్తులు తెలుసుకొని మసలుకోమంటారు గాని—

వా: చిన్నా పెద్దా అంతస్తు లేవిఁటోయ్ మహా? చేతిలో అధికారముందని యిష్టంవచ్చినట్లల్లా ప్రవర్తిస్తే, యివతల వీళ్ళకిగూడ కొస్త అభిమానమనేది ఎదురు తిరగదు?

గో: అభిమానమంటె ఆఫీసర్ని నువ్వెంతంటె నువ్వెంతని ఎదిరించడమనా అర్థం?

వా: ఎందుక్కాకూడదు? మనసులో మాట చెప్పడానికే భయమయితే యిక ఆ ఉద్యోగాలు చేసెందుకు? నీ స్టేటస్ గొప్పది కావచ్చు, ఇవతల వీళ్ళకిగూడ కొస్త పరువుమర్యాద లున్నాయని—

గో: ఉన్నాయని పోనీ ఆఫీసరు ముఖమ్మీదే ఎందుకు చెప్పుకోగూడదు?

వా: ఎందుకు చెప్పుకోవాలి?





గో: ఐతే నీ మనస్సు యిలాంటిదని, ఆయన పైపుచెయ్యమన్న కాగితాలని రఫ్యూజ్ చెయ్యడంవల్ల, తప్పులు కొట్టడం వల్ల తెలుస్తుందా?

వా: [మాటలు దొరక్క నసిగి]...ఐతే ...ఇంతకీ...నీ సలహా ఏవిఁటి?

గో: సలహా యిచ్చేపాటి తెలివి నాకెక్కడుందిలే! నువ్వు ఆ అభిమానమనే దాన్ని చంపుకోనూలేవు. ఆ ఉద్యోగం నిలవనూ నిలవదు. క్రమేపీ నీకే తెలిసొస్తుంది ధైర్యంలేని అభిమానం దురహంకారమని... వస్తా...

వి: ఫోంచేసి వెళ్ళన్నయ్యా.

గో: నాకు టైము లేదమ్మా...ఈసారి వచ్చినపుడు వుంటా...వస్తా వాసు. [ఫేడౌట్]

[విరామ సూచన]

వి: అన్నయ్యదగ్గరనించి జవాబు వచ్చింది.

వా: ఊఁ...ఏమని?

వి: తను రావడానికి వీలుచిక్కటం లేదట. వస్తే మన్నిద్దర్నీ రమ్మనమని—

వా: ఊఁ! ఎందుకు మనం వెళ్ళడం?

వి: మొన్న ఓ ఉత్తరం రాశాను.

వా: [కోపంగా] ఏమని?

వి: ఇంట్లో చాల యిబ్బందిగావుంది, తనని ఓసారి వచ్చి—

వా: అప్పుడే దేహీ అనటం మొదలు పెట్టావన్నమాట! నీకన్ని పట్టుకొనే నన్నిలా ఏడిపిస్తోంది.

వి: బాగుంది చిరాకు! పైగా ఈ నిందంతా నామీదా? ఆనాడు అన్నయ్య చెప్పినపుడే కొస్త తెలివి తెచ్చుకొని వుంటె, ఈనాటికీ కాడకి వచ్చివుండేదా?

వా: లేదు; అక్కడికి మీ అన్నయ్యే ఎంతో బుద్ధిమంతుడన్నట్టు—

వి: అలా అని నే నెందుకంటాను? వాడిలోవున్న తప్పులు వాడిలోనూ వుంటాయి. అదీగాక యింతాచేసి మన బ్రతుకెంత? పొమ్మంటె మరో బ్రతుకు తెరువు కనిపించదు. దేహీ అనటానికి అభిమానం చంపుకతింటుంది...

వా: నీ కెందుకభిమానం? మీ అన్నయ్య వున్నాడుగా కోపమొస్తే వెళ్లిపోడానికి? ఏదో యిప్పుడీ ఉద్యోగం పోయి కూచోబట్టి నా అభిమానాన్ని మీరంతా వేలెట్టి చూపిస్తున్నారుగాని—

వి: అలా వేలెట్టి చూపించేవరకు ఎవరికొ్కావాలి? మన మేలుకోరి సలహాలిచ్చే వారంతా మన్ని వెక్కిరించేవారేనా? పోనీ అది వెక్కిరింపే అనుకొందాం — పెద్దవాళ్లు మందలిస్తే అది మనమీద కోపంవల్లా?

వా: కాదు, ప్రేమవల్ల. ఇంతకీ యితగాడు మందలిస్తే పడేవాడెవడంట?

వి: అదుగో ఆమాటలే శెడిసికొడుతున్నాయి. ఆఫీసరుఎదటా ఈమాటలే అడి యింతవరకు తెచ్చుకున్నారు.

వా: సరె, యిహ నోరుమూసుకో.

వి: నోరు మూసుకొనే పడున్నాను. ఇంకా యిలా ఉద్యోగం వూడి పదిరోజులైనా కాలేదు, ఇంట్లో ఏమూల చూసినా కరువు ప్రత్యక్షం. ఈకాలంలో ఒక సంసారాన్ని ఒక సంసారం భరించడమంటె మాటలా? నామాట విని మరో ఉద్యోగానికైనా ప్రయత్నం చెయ్యండి.

వా: నీ సలహాలేకపోతే గోళ్లు గిల్లుకుంటూ కూచున్నాననా?

# ★ చిన్న చూపు ★

వి : ప్రతీ మాటకు అంత ముక్కుమీద కోపమెందుకండి? ఇంట్లో చూస్తే పొయ్యి మీదికి ఎసరు ఎక్క ఉపాయంలేదు, మగ మనిషీ అంటె యిలా వున్నారు. నన్నెక్కడనించి తెచ్చి సంసారం చెయ్యమంటారు?

వా : ఎంతో నువ్వే సంసారభారాన్ని మోసేస్తున్నట్టు మాటాడతావేం?

వి : పోనీ-ఎందుకు వాదన పెంచుకోవడం—మీరే మోసేస్తున్నారు. నిన్నటికి చేతిలో పైకంలేక జానకమ్మగారిదగ్గర ఐదు తీసుకున్నాను. బియ్యం ఈ ఒక్కరాత్రికి వస్తాయి. రేపటినించి పస్తుతప్పదు. ఎందుకు చెబుతున్నానో వినండి: ఒకసారి కాకినాడ అన్నయ్యదగ్గరకు వెళ్లండి.

వా : అబ్బబ్బ! ఇక వూరుకోందూ. ఒక్కక్షణం విశ్రాంతిగా కూచోనివ్వడానికి యిష్టంలేదా నీకు?

వి : ఎక్కడికి మళ్ళా వెళ్ళిపోతున్నారు?

వా : నీక్కావలసిందిఅదేగా?[ఫేడౌట్]

* * *

వి : రాండి పిన్నిగారు.

జా : ఏవమ్మా అలా వున్నావ్, ఒంట్లో బాగుండలేదా?

వి : ఏంబాగుండటం పిన్నిగారు. ఇంట్లో గొడవలు చూస్తూవుంటె గుండె పగిలిపోతూ వుంది.

జా : వాసుబాబుకి మరేదైనా ఉద్యోగం దొరకలేదా?

వి : ప్రయత్నిస్తున్నారు.

జా : ఏవిటో, ఉన్న ఉద్యోగం విడచిపెట్టుకోని పైవాటికి ప్రయత్నించడం నాకు నచ్చలేదుసుమా — నిజం చెప్పొద్దూ?

వి : అంతా నా దురదృష్టం పిన్నిగారు. ఈ నెలరోజులు పైపై అప్పులుచేసి, ఇంతో అంతో వెనకేసిన నాలుగురాళ్ళతోను నెట్టుకొచ్చాను; ఇక అదీ సాధ్యం కాదు.

జా : నిజమేనమ్మా. ఇన్నికష్టాల్లోగూడ నువ్వెలా నెట్టుకరాగలుగుతున్నావోగాని —

వి : ఈకాలంలో ఎవరికెవరు చెప్పండి పిన్నిగారు? అన్నయ్యఅయితేమాత్రం ఎంత కాలం చూడగలడు? తనకీ పిల్లా పీచూ వున్నారు. ఏదో పదీ పాతికో అంటే సహాయం చెయ్యగలడుగాని, నెల్లాళ్ళా అంటె

జా : అవును నిజమేతల్లీ! అందరి సంసారాలు అలానే వున్నాయి ఈకాలంలో... వాసుబాబు యింట్లో లేడా?

వి : పడుకున్నారు లోపల.

జా : ఉ...అది సరేకాని ... నీముఖం చూస్తూవుంటె అడగడానికి నాకు నోరు రావటం లేదమ్మ...

వి : ఏవిటి పిన్నిగారు?

జా : అదేనమ్మ. ఇంట్లో చాల యిబ్బంది పడిపోతున్నాను. చీటీ ఈనెల వస్తుందనుకున్నాను, అదీ రాలేదు; ఇంకా వారానికి గాని జీతాలందవు...అదే ... నువ్వు అప్పు తీసుకొన్న...పదీ...

వి : [గతుక్కుమని] ఇస్తానుపిన్నిగారు. అన్నయ్యకు ఉత్తరం రాశాను. ఇవాళ రేపులో రావచ్చు.

జా : ఎంతమాట! అలా వచ్చినపుడే ఇద్దువుగాని ... మరి నేను వస్తానమ్మ [ఫేడౌట్]

విజయ : మంచిది పిన్నిగారు.

వాసు:[ఫేడిన్]ఆవిడదగ్గర పదిరూపాయలెందుకు తీసుకున్నావ్? ... నిన్నే ... ఎందుకు?

వి : చేతిలో డబ్బులేక...మొన్న...

వాసు : అంత అవసరం వచ్చిందే?

వి : బియ్యం నిండుకున్నాయని...

వా : నిండుకోవూ! పైగా ఆవిడదగ్గర అన్నగారి గొప్పలు చెప్పకోవడం కొంత. ఏం యిన్నిరోజులూ మీ అన్నయ్యే నేవిటి ఈ సంసారాన్ని మోశాడు?

వి : అలా అని నేను చెప్పలేదు

వా : చెప్పలేదు? భావం అదికాదూ? ...సరె అంత అన్నయ్యే నీ అచ్చటా ముచ్చటా చూసేస్తుంటే అక్కడికే వెళ్ళు.

వి : ఎందుకండి యింత చిన్న విషయంలో మనసు పాడుచేసుకోవడం? ప్రతిదానికి యిలా తప్పుపడుతుంటె...

వా : అదే అంటున్నాను: నాకు మరో ఉద్యోగం దొరికేవరకు మీ అన్నయ్య యింట్లో వుండమని.

వి : బాగుంది!

వా : ఏం మాటలుమాత్రం ఆడగలవేం? నిజంగా వెళ్ళమనేసరికి అతనికంటె ముందు నీకే బాధెక్కువైపోతోంది.

వి : నా కెందుకు బాధ?...సరె మీ ఉద్దేశమదే ఐతే ఈరాత్రిబండికే నెడతాను.

* * *

[విరామ సూచన]

(గొట్టంతో పొయ్యి ఊదుతున్న చప్పుడు ...తలుపు తట్టిన శబ్దం తర్వాత)

వా : ఎవరు?

రమణ: [బయటనించి] నేను రా, రమణ

రావుని [తలుపు తెరచిన చప్పుడు] ఆఁ కులాసా? [ఫేడిన్]

వా : ఆఁ

ర : అబ్బబ్బ ! ఇదేవిట్రా. యిల్లంతా యిలా పొగ గిరవాటేసేసింది !

వా : ఉండుండు, ఊదుతాను.

ర : ఏం నువ్వొండడమేం శ్రీమతి లేదా?

వా : లేదు, కాకినాడ వెళ్ళింది.

ర : ఎన్నాళ్ళయింది ?

వా : నిన్నటికి వారం.

ర : స్వయంపాక మేనన్నమాట ?

వా : ఊఁ.

ర : అలా చెప్పు: అందుకే కళ్ళూ పళ్ళూ అలా తేలాయి. ఏం హోటల్లో భోజనం ఎరేంజ్ చేసుకోలేకపోయినావా ?

వా : ఆశక్తి లేదు.

ర : అదిసరేగాని ఈ మధ్య మునిసిపల్ ఆఫీసులో కొన్ని కాళీలువచ్చాయి; వాటికేమైనా అప్లికేషన్ ఒకటి పారెయ్యలేకపోయావా ?

వా : ఎప్లయిచేశాను...

ర : మరి ?

వా : ఇంటర్వ్యూలో ఫెయిల్.

ర : అయినా వాసు-నిజం అంటే నీకు కోపంగాని - చేతిలో ఉద్యోగాన్ని ఎంత మూర్ఖుడైనా ఆఫీసర్లతో పంతంపడి పోగొట్టుకొంటార్రా ? ఈ కాలంలో ఉద్యోగం దొరకడమంటె మాటలా ?

రవణ: నిజమే రవణా. ఈవిషయం అనుభవంమీదగాని తెలిసిరావడంలేదు.

ర : నీకు తెలీదు; నేను మొదటినించీ చెబుతూనే వున్నాను: ఏ ఆట కొంతాళం వెయ్యకపోతే ఈలోకంలో బ్రతకలేం.

వా: ఆనటనంతా మనుషులకి సహజంగానే అబ్బుతుందిలే. అది సరేగాని ఒకటడుగుతాను లేదనువుకదా ?

ర: ఏవిఁటి?

వా: కొంత డబ్బు.

ర: చంపేశావ్ ; ఈజేబులు చిల్లుకాన్పులికి తప్ప అణాకాసులకి నోచుకోలేదు.

వా: నిజమే రవణా ; ఇదీ ఓనటవే అనుకోవచ్చు.

ర: ఏవిఁటి...నీ ...అభిప్రాయం ?

వా: ఏం లేదులే. నిన్నప్రొద్దుట జగన్నాథాన్ని అడిగి లేదనిపించుకొన్నాను. సాయంకాలం రవణయ్యగారిని కదిపి మొండిచెయ్యిచూసి వచ్చాను. ఇప్పుడు నువ్వు...

ర: ని...న్నిజంగా నాదగ్గర ఓదమ్మిడీ అయినాలేదు; ఉంటె నువ్వేసిన ఒట్టు.

వా: ఎందుకులే ప్రమాణాలు... మనసులో మాటని ఎంత అణచేసుకొందా మను

కొన్నా లాభం లేకపోతోంది...నిన్నటినించి తిండిలేదు.

ర: పస్తె?

వా: అన్నమాటే. ఆఁ అడెంతలే మంచినీళ్లు వున్నంతవరకు ఫర్వాలేదు...కంగారు

పడొద్దు...నిన్న మా బావమరదికి ఉత్తరం రాశానులే. ఈపాటికి వచ్చేస్తుంటాడువాళ్లు.

ర: అయినా రెండురోజులు పస్తు...

వా: అలెంగ నీకెందుకులే.

ర: ఐతేసరేలే...మరివస్తా...పోనీ ఈ

# ★ చిన్న చూపు ★

వాళ్ళ మాయింటికి వచ్చెయ్యాగూడదు ?

వా: ఎందుకు లెస్తూ.

ర: సరేనీ యిష్టం. [వెళ్ళిపోతాడు]

(తలుపు తట్టినచప్పుడు)

వి: బయట తాళం వేసుంది, ఎక్కడికో వెళ్లినట్టున్నారన్నాయ్.

గోపా: నీదగ్గర మరో డూప్లికేట్ కీ వుందిగా, తెరు.

[తాళం క్లిక్ మన్నచప్పుడు...తలుపు తెరచిన శబ్దం]

వి: అబ్బ! ఇల్లంతా ఏమిటి యిలా దుమ్ముకొట్టుకొని వుంది ?

గోపా: [నవ్వి] మనవాడి స్వయంసాధన ఫలితాలమ్మ...మరో రెండురోజులు మనం రాకండా వున్నట్టయితే వాడే మనదగ్గరకు వచ్చుండేవాడు.

వి: అప్పుడీ అభిమానం అడ్డు రాదు కాబోలు ?

గో: అభిమానం! వీడికి యిదొక్కటే తక్కువ. వాడిమటుకి వాడు అనుకొంటున్నాడు: ఇదే ఆత్మాభిమానమని. కాని ఇది వాడిలోని గర్వం అని కనిపెట్టలేక పోతున్నాడు. ఒకసారి నేను ఓరచయితతో కలసి రావటం నీకు గుర్తే వుండివుంటుంది.

వి: ఆఁ.

గో: ఆయన్ని వీడికి పరిచయం చేస్తూవుంటె ఉఁఅన్నాడు కాదు, ఆఁఅన్నాడు కాదు. ఆయనచేసిన నమస్కారానికైనా కనీసం ప్రతినమస్కారం చేశాడు కాదు.

వి: ఆయనకు నమస్కారాలుఅలవాటు లేవు.

గో: లేవు! అమాత్రం యింగితం తెలియకపోతే ఎలా? ఆఫీసరుఎదుటా అమాటే!

వి: ఆయనకి యెక్కడ ఏమాట ఎలా ఆడాలో తెలీదన్నయ్యా.

గో: తెలీదనిపోనీ ఊరుకోగూడదు? తన ప్రజ్ఞనంతనీ తిరిగి చాటుకోవడమెందుకు?

వి: ఈ చాటుకోవడంలో కాస్త ఆత్మతృప్తి కలుగుతుందేమో?

గో: ఎందుకా ఆత్మతృప్తి? ఉన్న అహంకారాన్ని ప్రోత్సహించుకోడానికా? నాకు తెలుసమ్మా: ఇలాంటివాళ్ళు ఒంటరిగా ఏసమస్యనీ ఎదుర్కోలేరు. అందుకే నిన్ను కొన్నిరోజులపాటు నాదగ్గర వచ్చి వుండమన్నది.

వి: ఐతే ఆయన మనస్తత్వం పూర్తిగా మారిపోయి వుంటుందంటావా?

గో: పూర్తిగా అననుగాని, చాలవరకు. అందుకే యిలాంటి మనుషుల్ని లోకం మీద కొంతకాలంపాటు ఒంటరిగా విడిచి పెట్టెయ్యాలి. అప్పుడు, వాళ్ళమటుకి వాళ్ళకే విషయాల్లో నిజానిజాలు తెలిసొచ్చి విమర్శనాజ్ఞానం పుట్టుకొస్తుంది.

[బయట చెప్పుల చప్పుడు]

వి: అదుగో ఆయన వచ్చినట్టున్నారు.

గో: రారా వాసూ...మేమూ యిప్పుడే వచ్చాం

వా: [సిగ్గుపడుతూ] ఉ.

గో: ఏం అంత నీరసంగా వున్నావ్, వంట్లో బాగులేదా?

వా: ఏం...లే...ల్లే...దు.

వి: లేదేమిటి, కళ్ళెంత లోతుకిపోతే?

గో: [నవ్వి] వాడికి ఆ 'అభిమాన' మనేది ఇంకా పూర్తిగా చావలేదు. సరే, నువ్వు త్వరగా లోపలికివెళ్ళి వంటచెయ్యి ...ఈ రెండురోజులు పస్తేలాగుంది?

వి: అవును, అంతకుమించి ఆ అభిమానానికి విలువలేదు. [నవ్వుతూ నిష్క్రమణ]

గో: నిజం చెప్పరా: ఈరెండురోజులూ పస్తేనా?

వా: ఊఁ...

గో: ఇలా పస్తులున్నట్టు ఉత్తరంలో యెందుకు వ్రాయలేదు?

వాసు: [మాటలు దొరక్క క్షణం నిశ్శబ్దం] క్షమించు గోపాలం. నిన్ను నేను అర్థం చేసుకోలేక నీ సలహాలు పెడచెవిని పెట్టి ఈకాడకి తెచ్చుకున్నాను.

గో: అంతవరకు గుర్తిస్తె ఫర్వాలేదులే.

వా: మీరు ఈవాళగాని రాకపోయినట్టయితే నేనేమయేవాణ్ణో, ఏం చేసేసేవాణ్ణో—

గో: ఏం?

వా: జీవితంమీద విరక్తిపుట్టింది గోపీ. ఎవరినడిగినా ముఖంమీదేలేదు పొమ్మనేవారు—విజయవుంటె—

గో: ఉండబట్టే నీతప్పులు నీకు తెలిసొచ్చేవి కావు...సరే మాఆఫీసులో టైపిస్టులకి కాళీలువచ్చాయి; ఇదుగో ఫారమ్... తీసుకొని ఫిలప్ చెయ్యి.

వా: నిజం ?

గో: నిజమే చూడు.

వా: నీ ఋణం ఎలా తీర్చుకోవాలో తెలీడంలేదు గోపీ. తెలీక ఏవేవో అనేశాను. అన్నీ మరచిపోయి క్షమించు.

గో: నీలాంటి 'అభిమానం' నాకు లేదులే. నీ మటుకి నువ్వు అనుకొంటున్న ఆ 'అభిమానం' ఆత్మాభిమానం కాదు; ఇతరులంటె నీకున్న ఏహ్యభావం, చిన్నచూపు అది. వాటితో నువ్వు ఏ చిన్నమాటని విన్నా ఎదుటవారిమీద విరుచుకపడిపోయేవాడవు.

వా: అవన్నీ తిరిగి తల్చి నన్ను బాధించకు గోపీ.

గో: నీ దౌర్బల్యానికి నువ్వు సిగ్గుపడే క్షణం వచ్చేసరికి బాధపడటం గూడ నువ్వు సహించలేకపోతున్నావ్. ఇదే నువ్వు గ్రహించిన సత్యమయితే,జీవితంలో దాన్ని అమలుపరచడానికి ప్రయత్నించు.

వా: ప్రయత్నిస్తాను.

గో: ఉఁ ఇక ఆఫారమ్ ఫిలప్ చేస్తావా?

విజయ: [వస్తూ] ముందు స్నానాలు చేసి తలవేడి కాస్త తగ్గించుకోండి. తర్వాత ఫారాలు, ఉద్యోగాలు. ఊఁ... లేవండి.

[ఆలిండియా రేడియో ప్రసారితం]



తుంగభద్ర దృశ్యం - హంపి.

—ఫొటో: తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తి, (పిప్పర)




# 34

బికారులు నాటర్‌డామ్ చర్చిని ముట్టడించిన సమయంలో ఎమరాల్డా గాఢనిద్రలో ఉంది. కొంతసేపటికి చర్చిముందు కోలాహలానికి ఆమెకు మెలకువ వచ్చింది. ఎమరాల్డా లేచి కూర్చుని చుట్టూ చూసింది, కోలాహలం వింది. విని ఒక్క ఉదుటున లేచి పరుగునవెళ్ళి గోపుర శిఖరంపైనుండి కిందికి చూసింది. ఆ చీకటిలో కింద చర్చిప్రాంగణంలో కొందరు కప్పలవలె ఎగురుతున్నట్లు ఏదో అయోమయంగా కనపడింది. అక్కడినుండి ఆర్తనాదాలు కూడా వినవస్తున్నాయి. చీకటిలో అక్కడక్కడా కాగడాలు కదలాడుతున్నాయి కాని ఆమె ఎవరినీ పోల్చుకోలేకపోయింది. జిప్సీలమధ్య పెరిగి చిన్నతనంనుంచీ పెంచుకుంటూ వచ్చిన మూఢవిశ్వాసాలనుబట్టి ఆమె అదేదో దయ్యాలపోరాటమని ఊహించింది. తన గదిలోకి పరుగెత్తివెళ్ళి పడకలో ముఖం దాచుకుని భయం పోగొట్టుకోడానికి ప్రయత్నించింది.

కొంతసేపటికి భయంతగ్గి ఆమె తేరుకొన్నది. అప్పటికీ అదే రీతిగా కోలాహలం వినవస్తోంది. చర్చిముందు పోరాడుతున్నది దయ్యాలు కాదనీ మనుష్యులేననీ ఆమెకు చివరికి నమ్మకం కలిగింది. కాని ఈమాటు ఆమె భీతి మరింత ఎక్కువయింది. ఆమెనా ఆశ్రయంనుంచి ఎత్తుకొనిపోయి ప్రజలు చిత్రవధ చెయ్యడానికి వస్తున్నారని ఆమెకు తోచింది. మళ్ళీ ఆమెకు ప్రాణభయం పుట్టింది. ఆమె ఆశలు మళ్ళీ భగ్నమౌతున్నాయని తోచింది. తన నిస్సహాయస్థితిని తెలుసుకుంది. మళ్ళీ పక్కపై బోరగిలపడి గుండెదడ అణచుకోడానికి ప్రయత్నించింది. మనస్సులో భగవంతుని పరిపరివిధాల ప్రార్థించింది. చర్చిలో ఉన్నందుకు జిప్సీ దేవతలనే కాక క్రీస్తుదేవునీ, మేరీమాతనీ అతిదీనంగా ప్రార్థించింది. భయంవల్ల ఆమె శరీరంలో రక్తం గడ్డకట్టినట్లయింది. అలా ఆమె ఎంతసేపుందో తెలియదు. కొంతసేపటికామెకు సమీపంలో అడుగుల చప్పుడు వినవచ్చింది. భయంతో కెవ్వున అరిచింది.

"భయం లేదు" అన్న దొక కంఠం. "నేనే."

ఈ కంఠం ఆమెకు గుర్తే. అయినా అడిగింది "ఎవరు?"

"నేను. పీర్ గ్రింగైర్."

పేరు వినగానే ఆమెకు ధైర్యం కలిగింది. కళ్లెత్తి చూసింది. వచ్చింది అతడే. కాని అతనివెనుక నిలువెల్లా నల్లని దుస్తులు ధరించి ఒక ఆకారం నిలబడిఉండడంకూడా గమనించింది. ఆమె నోట మాట రాలేదు.

గ్రింగైర్ అధిక్షేపణసూచకంగా అన్నాడు: "నువ్వు కనుక్కోలేకపోయావు. డాలీయే ముందు నన్ను గుర్తుపట్టింది."

అతడు పేరు చెప్పకముందే మేక అతడివద్దచేరి మోకాళ్ళను పెనవేసుకున్నట్లు కాళ్ళెత్తి ప్రీతి ప్రదర్శించింది.

"నీవెనక ఎవరు?" అని ధైర్యంచేసి అడిగింది ఎమరాల్డా.

"ఫరవాలేదు. నా స్నేహితుడే"అన్నాడు గ్రింగైర్.

చేతిలో కొవ్వొత్తి దీపం పక్కగాపెట్టి మోకరించి మేకను ముద్దులాడ నారంభించాడు గ్రింగైర్. "ఏదీ నీగమ్మత్తులేం మరిచిపోలేదుకదా! నగరాధికారిఎల్లా నడుస్తాడో..."

వెనుకవ్యక్తి గ్రింగైర్‌ని భుజంపైన తట్టాడు.

"ఆ! ఆ!" అంటూ లేచాడు గ్రింగైర్. "మరిచేపోయాను. మనం త్వరపడాలి. ఎమరాల్డా! ఇప్పుడు నువ్వు పెద్దప్రమాదంలో పడ్డావు, డాలీకికూడా ముప్పే వచ్చింది. నిన్ను రక్షించడంకోసం వచ్చాం. మా వెంటరా" అన్నాడు.

"నిజం?" అందామె ఆందోళనతో.

మూలం:
విక్టర్ హ్యూగో

అనువాదం:
సూరంపూడి సీతారామ్

#  ఘంటారావం 

"అవును. నిజం. అందుకే త్వరగా బయల్దేరు."

"బయల్దేరతాను. కాని నీ మిత్రుడొక్కమాట పలకడేం?"

"ఏముంది?" అంటూ తడబడ్డాడు గ్రింగైర్, "వాళ్ళమ్మా నాన్నా చిత్రమైన మనుషులు కాబోలు! మౌనం, ముక్త సరిగా మాటాడ్డం నేర్పి ఉంటారు!"

అంతతో తృప్తిపడక తప్పలేదామెకు. గ్రింగైర్ ఆమె చెయ్యి పుచ్చుకున్నాడు. అతని మిత్రుడు దీపం అందుకున్నాడు. భయంవల్ల ఆమెబుద్ధి మందగించింది. మారుమాట లేకుండా గ్రింగైర్‌కి చెయ్యి అందిచ్చి అతన్ని అనుసరించింది. డాలీ ఉత్సాహంతో చకచక నడిచి వారి ననుసరించింది. ఆనందం పట్టలేక మాటిమాటికీ అతణ్ణి తలతో గెంట నారంభించింది. గ్రింగైర్ తూలిపడబోతూ అన్నాడు: "జీవితం అంటే ఇంతే! మనకి మంచిస్నేహితులైన వాళ్ళే అపచారం చేస్తూ వుంటారు."

గబగబ ముగ్గురూ మెట్లుదిగి కిందిభాగం చేరారు. అక్కడికి కోలాహలం భయంకరంగా వినవస్తోంది. చర్చి అంతా దద్దరిల్లి పోతోంది. చర్చి వెనుకవైపు నిర్జనంగా ఉంది వెనుకనున్న మిత్రుడు ముందుకువచ్చి ఒక ద్వారం తలుపులు తాళంతీసి తెరిచాడు. చర్చి దాటి నదివద్దకు వచ్చారు ముగ్గురూ. కల్లోలం దూరమైంది. నదివడ్డున నిలబడి చర్చివంక చూశారు ముగ్గురూ. పైన ఇంకా మంట వెలుగుతూనే వుంది. ఆ మంటలో రెండు గోపురాలూ ఆకాశంలోకి చొచ్చుకున్న రెండు ఈటెల్లా కనపడ్డాయి. నల్లని దుస్తులు ధరించిన మిత్రుడు దీపం పట్టుకుని ముందు దారి తీశాడు. నదిలో చిన్నబోటొకటుంది. ముందు గ్రింగైర్, ఎమరాల్డా, మేక, తరువాత అజ్ఞాతవ్యక్తి బోటెక్కారు పగ్గం విప్పి వదిలేశారు. అజ్ఞాతవ్యక్తి ముందు కూర్చుని తెడ్లు వేశాడు.

ఇక్కడ సీన్‌నది వడి ఎక్కువ. అతి కష్టంతో తెడ్లువేసి బోటు నడుపుతున్నాడు. గ్రింగైర్ వెనుకవైపు కూర్చుని మేకని ఒళ్లోకి తీసుకున్నాడు. ఎమరాల్డా భయంతో అతని పక్కనే అతన్ని గట్టిగా పట్టుకుని కూర్చుంది. బోటు కదలి కొంత దూరం పోయిన తరవాత గ్రింగైర్ "అమ్మయ్యా! ఇంక బతికాం" అన్నాడు "కొన్ని కొన్ని మహాత్కార్యాలు అదృష్టదేవత కరుణ వల్ల సమకూడుతాయి; ఒకొక్కప్పుడు మన చాకచక్యంవల్ల సాధ్యమాతాయి."

బోటు ఆవలిఒడ్డు చేరుతున్నకొద్దీ ఎమరాల్డా ఏదో తెలియరాని భీతితో బితుకుబితుకు మంటోంది. నూతన వ్యక్తి దీపపు కాంతి తన ముఖంపై పడకుండా నల్లని గుడ్డతో ముఖం కప్పుకున్నాడు. చీకటిలో చేతులు చాచి అతడు తెడ్లు వేస్తున్నప్పుడు చేతులకున్న పొడవైన నల్లచొక్కా చేతులు విస్తరించి, అతడొక పెద్ద గబ్బిలంలా కనపడుతున్నాడు. అతడొక్కమాట మాట్లాడ లేదు.

"అబ్బ! ఇంత నిశ్శబ్దం భరించలేం. ఎవరో ఒకరు నాతో మాట్లాడకూడదూ?" అన్నాడు గ్రింగైర్. "మనిషి కంఠం మనిషి చెవికి అమృతం పోసుతుంది. ఎమరాల్డా! నీకు అసలు విషయం తెలుసా? రాజాధికారులు చర్చిలో ప్రవేశించి నిన్ను తీసుకుపోడానికి పార్లమెంటుని అనుమతి కోరబోతున్నారు. అరె! మబ్బు విడిపోతోందా? వెన్నెల వచ్చినట్లయితే ప్రమాదమే! మనల్ని ఎవరైనా చూస్తారు. ఈ యువతిని రక్షించి గొప్ప ఉపకారం చేద్దామనుకుంటే, మనల్ని పట్టుకుని ఉరితియ్యరుగదా - నిష్కారణంగా?! ఒకడికి మంచైనది మరొకడికి చెడ్డగా తోచడం లోకంలో పరిపాటేగదా! ఏమిటి? ఎవ్వరూ మాట్లాడదల్చుకోలేదా? ఇంక నాలో నేనే మాట్లాడుకోవాలన్నమాట! మహారాజుని ఇందాకనే చూశాను. నీచుడు, నేను రాసిన నాటకానికి

డబ్బివ్వ వేలేదు. ఇంకా నయం నన్ను ఉరితీయించేవాడు. కాస్తంతలో తప్పింది. ప్రతిభగల వాళ్లని చూస్తే అతడికి వెర్రెత్తుతుందిట!"

గ్రింగైర్ తనధోరణి ఆపాడు. ఎవరూ మారుపలక లేదు.

"అన్నట్లు అడగడం మరిచిపోయాను మీరు గమనించారా?" అన్నాడు తెడ్లు వేస్తున్న వ్యక్తిని సంబోధిస్తూ. "మీ క్వాసిమోడో ఎవణ్ణో కాళ్లు పట్టుకుని విసిరి గోపురానికి వేసి కొట్టాడు. నేను చీకటిలో గుర్తుపట్టలేదు."

ఆ వ్యక్తి జవాబివ్వలేదు కాని చేతిలో తెడ్లు నిలిచిపోయాయి. అతడి తల వాలిపోయింది. గాఢనిశ్వాసం విడిచాడు. తెడ్లు వెయ్యనందువల్ల బోటు ప్రవాహంలో కొట్టుకు పోసాగింది. కొంతసేపటి కావ్యక్తి తేరుకుని మళ్ళీ తెడ్లు వెయ్యడం మొదలు పెట్టాడు.

గ్రింగైర్ మళ్ళీ మొదలు పెట్టాడు. ఎమరాల్డావంక తిరిగి చెప్పాడు: "చరిత్రలో జరిగిన ఒక కథ చెప్తాను వింటావా? మోహం ఎంత దారుణమైన దనుకున్నావ్? అబ్బబ్బ! అక్కడ ఎంత రణగుణధ్వని చేస్తున్నారు?"

అప్పటికి నాటర్ డామ్ చర్చివద్ద కోలాహలం మరింత చెలరేగింది అప్పటికి అశ్వికదళాలువచ్చి బికారుల్ని చిత్రవధచేశాయి. సైనికులు పెద్దపెద్ద కాగడాలు తీసుకుని చర్చిఅంతా వెతుకుతున్నారు. నదివడ్డున కాగడాలు కనపడుతున్నాయి. "జిప్సీపైనుందేమో చూడండి. పట్టుకోండి" అని కేకలు వినపడుతున్నాయి. ఎమరాల్డా తలవంచుకుంది. కొత్తవ్యక్తి జోరుగా తెడ్లు వేస్తున్నాడు. గ్రింగైర్ ధోరణి మానేసి ఆలోచనలో పడ్డాడు.

గ్రింగైర్‌కి భయం కలిగింది. జిప్సీతో సహా అందరూ దొరికిపోతే తననికూడా ఉరితీసేసారు. జిప్సీని తన మిత్రుడే కాపాడుకుంటాడు. తాను మేకను తీసుకుని వెళ్ళిపోడం మంచిది.

బోటు ఒక్కసారి గట్టిగా కుదిపింది. ఒడ్డు చేరినట్లు గ్రహించారు. నూతనవ్యక్తి లేచి యువతి చెయ్యి అందుకున్నాడు. ఆమె చెయ్యి లాక్కుని గ్రింగైర్‌ని గట్టిగా పట్టుకుంది. గ్రింగైర్ మేకను గట్టిగా పట్టుకుని ఆమెను మెల్లిగా నెంటాడు. ఇంక చేసేది లేక ఆమె బోటు దిగింది నిశ్చేష్టురాలై ఒడ్డున నిలబడింది ఆమె దృష్టి నదీప్రవాహంపైనే ఉంది. భీతివల్ల ఆమెకు బుద్ధి పని చెయ్యడం లేదు. చైతన్యం లేక చూస్తూ ఉండిపోయింది. కొంతసేపటికి ఆమె తెలివి తెచ్చుకుని చూసింది. బోటులో ఎవరూ లేరు. నూతనవ్యక్తి ఆమెమాత్రం ఒడ్డున మిగిలి ఉన్నారు. ఆమెస్థితి గమనించి గ్రింగైర్ మేకతో సహా బోటు దిగి దాటేశాడు.

ఎమరాల్డా వొణికిపోయింది. ఏదో మాట్లాడాలనుకుంది కాని నోటివెంట మాటరాలేదు. అతడామె చెయ్యి పట్టుకున్నాడు. ఇంక కర్మను తప్పించడం సాధ్యంకాదనుకుం దామె. అతడివెంట నడవనారంభించింది. చుట్టూ చూసింది. ఒక్క మనిషి కనపడలేదు. ఆమె ఏదారిని నడుస్తున్నదో గుర్తించడానికైనా ప్రయత్నించ లేదు. ఒకచోట ఒక యింటిలోనుండి వెలుగు కనపడింది. హఠాత్తుగా ఆగి ఆమె ఆర్తనాదం చేసింది. ఆ యింటి కిటికీ తెరుచుకుంది. ఒక వ్యక్తి దీపంతో సహా వచ్చి వీధిలోకి చూశాడు. చూసి తిరిగి కిటికీ మూసుకున్నాడు. ఆమె ఆశ అంతరించింది.

కొత్తవ్యక్తి వేగం మరింత హెచ్చించాడు. ఆయాసపడుతూ అడిగింది "ఎవరు నువ్వు? ఎవరు?"

అతడు జవాబివ్వలేదు. చివరి కిద్దరూ ఒక విశాలమైన ప్రదేశానికి చేరుకున్నారు. ఇద్దరూ ఆగారు. ఎమరాల్డా చూసింది. అది గ్రీవ్ చౌకు. అత డామెవంక తీక్షణంగా చూశాడు. ముఖంపై ఆచ్ఛాదనం తొలగించాడు. "అమ్మో" అంది ఎమరాల్డా. "మొదటే భయపడ్డాను, నువ్వేనని."

అతడు క్లాడ్ ఫ్రొలో. అతడు ప్రేతాకారంవలె ఆమెకు గోచరించాడు. వెన్నెలలో అతడి ముఖం స్పష్టంగా తెలుస్తోంది.

"ఇటు విను" అన్నాడు క్లాడ్. ఆ కంఠం వినేసరికి ఆమె నిలువెల్లా కంపించిపోయింది. అతడు లోని ఆవేగాన్ని అణుచుకుంటూ చెప్పాడు: "ఇది గ్రీవ్ చౌకు. ఇంక ముందుకు పోనక్కరలేదు మనం. విధి మనల్ని ఇద్దరినీ ఒకరినొకరి అధీనంలో విడిచిపెట్టింది నీ ప్రాణాలిప్పుడు నాచేతిలో ఉన్నాయి. నా ఇహం పరం నీ అధీనంలో ఉన్నాయి. నేను చెప్తున్నది జాగ్రత్తగా విను. కాని నాకు జవాబు చెప్పకు. ఫీబస్ పేరు మాత్రం ఎత్తవద్దని గట్టిగా చెప్తున్నాను."

మాట్లాడుతూ అతడు అటు ఇటు పచార్లుచెయ్య నారంభించాడు కాని ఆమెచెయ్యి విడిచిపెట్టలేదు. ఆమెనుకూడా తనవెంట గబగబా నడిపించుకొని ఆమె నెక్కడికో తీసుకుపోతున్నాడు. పచార్లు తిప్పుతున్నాడు. "వాడి పేరుమాత్రం నావద్ద ఎత్తకు. ఎత్తావంటే నేను కోపంలో ఏం చేస్తానో నాకే తెలియదు. కాని ఘోరం జరిగిపోతుంది. జాగ్రత్త."

కొంచెంసేపు నిలబడి ఆలోచించాడు. తరవాత అన్నాడు: "నేను చెప్పేది శ్రద్ధగా విను. నవ్వకు. ఇది నవ్వులాట కాదు. పార్లమెంటు డిక్రీ ఇచ్చేసింది—నిన్ను ఉరితియ్యమని. నిన్ను వాళ్ళబారినుంచి ఇప్పుడు రక్షించాను. అక్కడ సైనికులు నీకోసం వెతుకుతున్నారు."

ఆ సమయానికి సిపాయిలు, పోలీసులు చర్చి చుట్టుప్రక్కల వీధులలో వెతుకుతున్నారు.

"నువ్వే చూడు అటువైపు. నీ కోసం వెతుకుతున్నారు. నేనేమీ మోసం చెయ్యడం లేదు. నిన్ను నేను నా ప్రాణంతో సమానంగా ప్రేమిస్తున్నాను. ఆగు నువ్వు మాట్లాడకు. నన్ను అసహ్యించుకుంటున్నావని నువ్వు వేరే చెప్పనక్కర్లేదు నాకు. చెప్పవద్దు. నే నామాట నీ నోట వినదలచుకోలేదింక నిన్ను నేను రక్షించాను. నిన్ను రక్షించగలను. అంతా సిద్ధం చేశాను. ఇంక నీ అంగీకారం ఒక్కటే మిగిలింది. అంటే చెప్తున్నాను విను...ఆగు."

ఆమెను చౌకులోని ఉరిస్తంభం వద్దకు లాక్కువెళ్ళాడు. చెయ్యెత్తి దానివంక చూపుతూ అన్నాడు. "నిశ్చయించుకో—నేనే కావాలో నీకు, లేక అదే కావాలో. తేల్చుకో."

ఆమె అతడి గుప్పిటనుండి గుంజుకుని విడివడింది. ఉరిస్తంభం వద్దకు వెళ్లి చేతితో తట్టి ఉరిస్తంభాన్నే ఎంచుకున్నట్లు తెలియ పరిచింది.

క్లాడ్ స్తంభితుడై ఆమెవంక చూశాడు. "ఉరిస్తంభంకంటె నువ్వే భయంకరంగా ఉన్నావు" అన్నాడు. "ఈ రాళ్లకే నోరుంటె, నాకంటే వ్యథపొందిన మనిషి ఇంకొకడు లేడని చెప్పగలవు నేను నిన్ను అపేక్షించాను" అని ఆగిపోయాడు.

ఎమరాల్డా ఉరిస్తంభం వద్ద మోకరిల్లింది జవాబివ్వలేదు.

అతడిలా చెప్పాడు: "నీపట్ల ప్రేమ నా హృదయంలో దావాగ్ని రెచ్చగొట్టింది నీ కటాక్షం కోసం నన్ను ఏం చెయ్యమన్నా చేస్తాను. నీ నిరాకరణవల్ల మాత్రం నా జీవితం అంతా నరకప్రాయమైపోయింది. ఇప్పుడైనా మించిపోలేదు. నన్ను రక్షించు. నేను క్రూరుణ్ని, కఠినుణ్ని అనుకుంటున్నావు నిజంగా నాదెంత మెత్తని మనస్సో నీకు తెలియదు. నిన్ను నాప్రాణ సమంగా ఆదరించి ఆరాధిస్తాను. ఒక యువతిని ఒక పురుషుడు ప్రేమించాడంటే అది అతని తప్పుకాదు. తిరస్కరించబడితే అతను కఠినుడూ, క్రూరుడూ కాక మరేమౌతాడు? నీ హృదయం నిజంగా అతి సున్నితం. నీ శరీరం అతికోమలం. నీ సౌందర్యం అమేయం. కాని నా ఒక్కడిపట్లనే కఠిన పాషాణమైనావు.

 

# ఘంటారావం



ఎంత ప్రారబ్ధం" అని లలాటం కొట్టుకున్నాడు. తరవాత చేతులతో ముఖం కప్పుకుని సన్నసన్నగా విలపించాడు.

అతడి నంత దీనావస్థలో చూడ్డం ఎమరాల్డాకి ఇదే మొదటిసారి. కాని ఆమె ఒక్క పలుకు పలకలేదు.

క్లాడ్ కొంతసేపటికి తేరుకుని అన్నాడు: "చెప్పాలంటే నాకు మాటలు రావడంలేదు. నీకు నిష్కర్షగా చెప్పాలనుకున్నది చెప్పలేకపోతున్నాను. అది చెప్పాలంటే ఒళ్లు జలదరిస్తుంది. నన్నేదో మహాశక్తి ఆవహించింది. నామీద నీకు జాలి లేదా? ఎందుకిలా నిన్ను నాశనం చేసుకుంటావు, నన్ను చేస్తావు? నా సర్వస్వాన్నీ, ఇహాన్నీ పరాన్నీ త్యజించి నీకోసం అర్థిస్తున్నాను. నాకు తెలుసు, ఇంతకంటె నీచం మరొకటుండబోదు. నేను అన్నివిధాలా పతితుడినైనాను. ఇదంతా నీకోసం. అయినా నన్ను తిరస్కరిస్తున్నావు. ఇంకొక విషయం చెప్తున్నాను విను. అదెంత ఘోరమైనదో చెవులారా విను. చిన్నతనంనుంచి సాకి పెంచి పెద్దచేసిన నా తమ్ముణ్ణి రక్షించగలిగి కూడా రక్షించలేకపోయాను. నీవల్లనే సుమా! నేను కళ్ళారా చూస్తుండగా నా తమ్ముణ్ణి నా పెంపుడుకొడుకు విసిరి గోడకేసి కొట్టి చంపేశాడు..."

ఇంక అతడు మాట్లాడలేకపోయాడు. పిచ్చి పిచ్చిచూపులతో ఆమెను చూశాడు. "నీకోసం..." అన్నాడు. ఉన్నట్టుండి అతడిలో క్రోధం పెల్లుబికివచ్చింది. "నాకు పిచ్చెత్తిపోతుంది. నన్ను రాక్షసునిగా మార్చకు సుమీ. నేను సహించలేను. ఒక్క మాట చెప్పు. నా వలపు స్వీకరించినట్లు ఒక్కమాట చాలు."

ఆమె ఏదో చెప్పాలని పెదవులు కదల్చింది. ఈమారు ఆశతో అతడామెముఖంవంక చూశాడు. ఆమెను సమీపించి ఆమెముందు మోకరిల్లాడు. "నువ్వు హంతకుడవ్" అని ఆమె అన్నమాటలు వినపడ్డాయి. పులి మేకను పట్టుకున్నట్టు అతడామెను ఒడిసి పట్టుకున్నాడు. అట్టహాసంగా పిచ్చినవ్వు నవ్వాడు. "నేను హంతకుణ్ణే. కాని నిన్ను పొంది తీరతాను. నీకు బానిసగా ఉండబోను, యజమానినౌతాను. నాతో నువ్వు రాక తప్పదు. లేదా నిన్ను అప్పగించి తీరతాను. నువ్వు చచ్చిపోక తప్పదు. అప్పుడు తప్పకుండా హంతకుణ్ణి కాకమానను" అంటూ ఆమెను పొదివి పట్టుకుని ఆమె కంఠంపైనా భుజాలపైనా చుంబించ నారంభించాడు. ఆమె పెనగులాడింది "రాక్షసుడా. వన్నొదులు. లేకపోతే నీ ముఖంచీల్చి నెత్తురు చూస్తాను" అంటూ అతడి చెయ్యి పట్టుకుని గట్టిగా కరచింది. అతడామెను వదలిపెట్టాడు. అతణ్ణి జయించాననుకుందామె. "ఫీబస్ తప్ప ఇంకొకడు నాకక్కరలేదు. నీ పీనుగు ముఖమూ నువ్వూ పో ఇక్కడనించి."

"అయితే చావు" అని అరిచాడు. క్లాడ్ పళ్లు పటపట కొరుకుతూ ఆమెను పట్టుకున్నాడు. ఆమె నొక్కతోపుతో క్రింద పడగొట్టి ఆమె రెండుచేతులూ పుచ్చుకున్నాడు. రోలండ్స్ టవర్ వైపుకి ఆమెను నేలపైన బరబర ఈడ్చుకు పోయాడు. టవర్ ముందు ఆగాడు.

"ఆఖరుసారి అడుగుతున్నాను. చెప్పు. నన్నంగీకరిస్తావా లేదా?"

"అంగీకరించను."

క్లాడ్ బిగ్గరగా అరిచాడు: "గ్యుర్లా! సిస్టర్ గ్యుర్లా! ఇదుగో జిప్సీ. నీ పగ తీర్చుకో" క్లాడ్ జిప్సీని లేవదీసి నిలబెట్టాడు. హఠాత్తుగా ఆమె చేతుల్ని ఏవో రెండు ఉక్కు చేతులు పట్టుకున్నట్టయింది. ఎమరాల్డా చూసింది. గోడలో రంధ్రంవంటి ఒక కిటికీలోనుంచి కంకాళంవలెనున్న ఒక వ్యక్తి తన చేతులు పట్టుకున్నట్లు చూసింది.

"గట్టిగా పట్టుకో. ఆ రోజున పారిపోయిన జిప్సీ ఇదే. తప్పించుకు పోనివ్వకు. నేను వెళ్ళి పోలీసుల్ని పిలుచుకువస్తాను. దీన్ని ఉరితీస్తోంటే నువ్వు స్వయంగా చూద్దువుగాని" అన్నాడు క్లాడ్.

ఈ మాటలకు సమాధానంగా అమానుషమైన వికృత హాసం ఒకటి వినవచ్చింది. క్లాడ్ ఆమె నక్కడ విడిచిపెట్టి నాటర్ డామ్ వంతెన వైపుకు పరుగెత్తాడు.

(ఇంకా వుంది)

పెద్ద కథ:

# ఉద్యోగాలు

(గతసంచిక తరువాయి)

ఈవిధంగా కాలేజీనుంచి సమాధానం వస్తుందని మొదటే అనుకున్నారు. ఉద్యోగం పోయినట్టు శర్మ చెవిని పడటానికి వీల్లేదని డాక్టరుగారు చెప్పేరు. అంతకు పూర్వమే అందరూకూడా ఆవిధంగా అనుకున్నారు.

"మా తమ్ముడు ఇటువంటి చిన్న ఉద్యోగానికి పనికిరాడు వాటికి నిర్దేశించబడలేదని అనేకసార్లు చెప్పేను" అన్నాడు రంగారావు

పూర్తి తెలివిరాగానే శర్మ వేసిన మొదటిప్రశ్న ఉద్యోగాన్ని గురించి. ఒక నెలరోజుల శెలవుకు దరఖాస్తు చేసినట్లూ, కాలేజీవారు అనుమతి యిచ్చినట్లు తండ్రి చెప్పేడు.

తల్లిమాత్రం "ఉద్యోగంలేదని పైకి అనకపోయినా మనసులో యెంత బాధ పడిపోయాడో పాపం." అనుకుంది.

పదిరోజుల తర్వాత కృష్ణారావు కాంప్ పేరుతో కాలేజీవున్న వూరికే మళ్ళీ వచ్చేడు. ఊళ్ళో పనిచూసుకొని కాలేజీకి వెళ్లి "ఫలానా శర్మ అనేవారు వున్నారా?" అని అడిగేడు. అక్కడవారు "శర్మ యెవరో మాకు తెలియదన్నారు. హాస్టలుకు వెళ్ళి విజయసారథిని కలుసుకున్నాడు. అతను శర్మ తనకు కాలేజీలోకాని వూళ్లోకాని యెక్కడా కనబడలేదన్నాడు. బజార్లో కొంతపని పూర్తిచేసుకొని మాథమెటిక్సు లెక్చరర్ రూంకి వెళ్లేడు. ఆయన, శర్మకు టైఫాయిడ్ వచ్చినట్టు అతని తండ్రిదగ్గరనుంచి వుత్తరం వచ్చిందనీ, అతని సెలవు దరఖాస్తు గ్రాంట్ కాలేదని, కాలేజీవారు అతని స్థానంలో ఇంకొకరిని నియమించేరని చెప్పేడు.

కృష్ణారావక్కడ నిలబడలేకపోయేడు. "శర్మ దురదృష్టానికి ఒక హద్దంటూ లేదేమో!" అనుకున్నాడు. వెంటనే వెళ్ళి శర్మని చూద్దామనుకున్నాడు. ఆ వూళ్ళో మిగిలివున్న కొద్దిపనిని త్వరగా పూర్తిచేసుకొని సాయంత్రం ట్రైనుకు బయలుదేరుదామని వూళ్ళోకి వచ్చేడు

బజార్లో గాంధీచౌక్ దగ్గర రాఘవరావు కనిపించేడు. కృష్ణారావుని చూడగానే సైకిల్ దిగి వచ్చేడు.

"శర్మని ఉద్యోగంలోంచి తీసివేసేరట నిజమేనా?" అన్నాడు. కృష్ణారావుకు వళ్లు మండింది.

"అసలు శర్మకు ఉద్యోగం వచ్చినట్లు నీకెవరు చెప్పేరు?" అన్నాడు కృష్ణారావు.

"శర్మే ఉత్తరం వ్రాసేడు"

"అయితే ఉద్యోగం తీసేసినట్టుకూడా అతనే వ్రాసేడా?"

"లేదు. ఆవిధంగా తెలిసింది"

"నీకు కిట్టనివాళ్ళెవరో ఆవిధంగా చెప్పేరు. శర్మని ఉద్యోగంలోంచి ఎవరూ తీసివేయలేదు. అతనే మానేసేడు" కృష్ణారావు ఈ మాటల్ని కొంచెము తీక్షణంగా అన్నాడు. తర్వాత వెళ్ళిపోయేరు.

కృష్ణారావుకి ఆ సాయంత్రం కంపెనీ వాళ్లదగ్గరనుంచి ఒక టెలిగ్రాం వచ్చింది. ఫలానావూళ్ళో తొందరపను లున్నాయనీ, అక్కడకు వెంటనేవెళ్ళి తర్వాత కంపెనీ హెడ్ క్వార్టర్సుకు రావలసిందనీ వ్రాసేరు. కృష్ణారావు కంపెనీపనిమీద వెళ్ళిపోయేడు.

## జె. పరబ్రహ్మం

శర్మపరిస్థితి రోజురోజుకీ కుదుట పడుతూనే వుంది. మందులు శ్రద్ధగా పుచ్చుకుంటున్నాడు. ఎంతత్వరగా తగ్గితే అంత త్వరగా కాలేజీకివెళ్ళి చేరవచ్చునని అతని ఆశ. తనకు నెలరోజులు శెలవు యిచ్చేరని తండ్రి చెప్పేడు. తను నమ్మేడు. వచ్చిన బంధువులు క్రమక్రమంగా వెళ్ళిపోయేరు. శర్మకు పూర్తిగా నెమ్మదించింది. పథ్యం పుచ్చుకున్నాడు.

తర్వాత ఉద్యోగంసంగతి శర్మకుచెప్పక తప్పిందికాదు. అతను చాల విచారించేడు. తన కాసంగతి యింతవరకూ యెందుకు చెప్పలేదన్నాడు.

"నీకుచెప్పినా చెప్పకపోయినాఒక్కటే. నీవు తెలిసికొని చేయగలిగేదేమిటి?" అన్నారు.

"నువ్వు నాలుగైదునెలలు విశ్రాంతి తీసుకుంటే కాని తేరుకోలేవు. ఒచ్చేయేటికి ఆ కాలేజీలోనే కాళీ వసుందట. దానికి నువ్వు ప్రయత్నం చేయవచ్చు. ఈలోగా చెడిపోయిం దేమీలేదు" అన్నారు.

తర్వాత శర్మ ఉద్యోగంసంగతి యెవరూ యెత్తలేదు. అప్లికేషన్ను పెట్టుకోమనికాని, వద్దనికాని సొంటిసలహాలు ఇయ్యలేదు.

ఒక నెలరోజులు గడిచేయి. జ్వరం తగ్గిన తర్వాత శర్మకు ఆకలి యెక్కువైంది. తల్లీ, భార్యా, అతని ఆరోగ్యవిషయమై ప్రత్యేకమైన శ్రద్ధ చూపిస్తున్నారు. పాలు పళ్లు మొదలైన పుష్టికరమైన ఆహారం వేళ తప్పకుండా సక్రమంగా అతనికి యిస్తున్నారు. మొత్తంమీద ఈ నెలరోజుల్లోనూ పూర్వం కంటే ఆరోగ్యకరమైనస్థితిలోకి వచ్చేడు.

కృష్ణారావు యింతవరకూ యింటికి తిరిగి రాలేదు. జీతాలందగానే నెల మొదటి వారంలో తప్పకుండావచ్చేవాడు. ఇంటికి నెలకు సరిపోయే వస్తువులన్నీ కొని మళ్లీ వెళ్ళిపోయేవాడు, ఈసారి అతనిదగ్గరనుంచి మనియార్డరు మాత్రమే వచ్చింది. ఇంకొక రాష్ట్రంలో పనిచేసే ఏజంటును కంపెనీ డబ్బు దుర్వినియోగం చేసేడని తొలిగించి ఆ పనిని కూడా కృష్ణారావునే చూడమన్నారు. దానికి బదులుగా తర్వాత నెలలో పదిహేనురోజులు శెలవు వినియోగపరచుకోవచ్చునని తెలియజేసేరు. ఈ సంగతులు ఇంటికి ఉత్తరంద్వారా తెలియ

# ★ ఉద్యోగాలు ★

జేస్తూ శర్మకు స్త్రీవివరాలు కంపెనీ ఎడ్రస్సుకు వ్రాయవలసిందని వ్రాసేడు.

ఒకరోజున శర్మ వారియింటికి వెళ్లేడు. వారు ఈ వివరాలు చెప్పేరు. ఇంకొక పది రోజుల్లో కృష్ణారావు రావచ్చుననికూడా చెప్పేరు. శర్మ తన యం. ఏ. పుస్తకాలు చదువుకుంటూ ఆ పది రోజులూ గడిపేడు.

ఒకరోజున కృష్ణారావు వచ్చినట్లు వాళ్ల పెద్దబ్బాయి కనబడి చెప్పేడు. శర్మ వాళ్లింటికి వెళ్ళేడు.

"నేను వచ్చినట్టు యెల్లాగ తెలిసింది? నేనే వద్దామనుకుంటున్నాను" అన్నాడు.

"మీవాడు చెప్పేడు" అన్నాడు శర్మ. తర్వాత తన్ను రైల్లో యెక్కించింది లగాయతు అప్పటివరకూ జరిగినవన్నీ శర్మ చెప్పేడు.

కృష్ణారావు కూడా తనకూ రాఘవరావుకు జరిగిన సంభాషణా, తన ఇతర క్యాంప్ విశేషాలు చెప్పేడు. తనకు పదిహేనురోజులవరకూ ఇక యెక్కడకూ వెళ్లక్కర్లేదన్నాడు.

ఒకరోజు వుదయం కృష్ణారావు వచ్చి "నిన్న సాయంత్రం రాఘవరావు వచ్చేడు" అన్నాడు.

"విశేషమేమన్నా వుందా? లేక వూరికేనే వచ్చేడా?"

"వాడు రావటంలో ప్రత్యేకమైన విశేషమేమీ లేదుకాని మనిషిలో మాత్రం విపరీతమైన మార్పుంది. ఇప్పుడు పూర్వంలాగ లేదు. అహంభావం పూర్తిగా తగ్గినట్టుంది. వెటకారంగా కాకుండా మనసిచ్చి మాట్లాడుతున్నాడు. మాట్లాడుకుందుకు సాయంత్రం మా యింటికి వస్తానన్నాడు. ఒక వారం రోజులు శెలవు పెట్టేడట" అన్నాడు కృష్ణారావు.

సాయంత్రం ముగ్గురు మిత్రులు కృష్ణారావింటిదగ్గర చేరేరు. రాఘవరావు ఉద్యోగంలో చేరటానికి పూర్వంవున్న అహంభావం, హుషారు చాలభాగం అణగారిపోయేయి. జబ్బుచేసి తేరుకున్న శర్మకంటె యెక్కువగా చిక్కిపోయివున్నాడు. అతని వేషంలో మాటల్లో యెంతో సంస్కారం వచ్చినట్లు కనపడింది.

గత పదిహేను సంవత్సరాల్లోనూ, హైస్కూలు చదువుకానీ, కాలేజీ చదువు కాని తీసుకురాలేని ఈ గొప్ప మార్పును తెచ్చిన మహత్తర శక్తి తాలూకా ఆఫీసు ఉద్యోగానిదే అనటంలో యెంతమాత్రం సందేహం లేదు.

[illegible] రోజుల్లో అతను సాధించింది యేమీ లేకపోయినప్పటికీ అతని గర్వానికి పోకిరితనానికీ ఒక హద్దుండేది కాదు. అతనిచే అవమానింపబడని ఉపాధ్యాయుడు కాని, అతను యెదిరించని లెక్చరర్ గానీ లేడు. ఒకరిచే ఆజ్ఞాపించబడటం కానీ, ఒకరు తనకంటే యెక్కువ అన్న భావాన్ని కానీ అతను సహించలేకపోయేవాడు. క్లాసులో ఒకగంట కూర్చునే ఓపికగానీ, క్రమశిక్షణగాని అతనిలో యేకోశానా లేవు. అతను విజయవంతంగా కాపీకొట్టని పరీక్ష లేదు. అటువంటి రాఘవరావుని తాలూకా ఆఫీసు ఉద్యోగం మూడు నెలల్లో పూర్తిగా లొంగదీసింది.

మొదటి రోజున సూటు, హాట్, నెక్టయిలతో నిండుగా ఆఫీసుకు వెళ్లేడు. అందరి చూపులూ అతనిమీదనే పడ్డాయి. ఈ వుద్యోగానికి ఈ వేషం తగదనుకున్నాడు.

# ★ ఉద్యోగాలు ★

రెండవ రోజున ఆలస్యంగా వెళ్ళేడు. ఆఫీసరు చివాట్లు వేసేడు. ఎదిరించడానికి అతను ఉపాధ్యాయుడు కాడు. లెక్చరర్ దృష్టిని తప్పించుకొని క్లాసునుండి జారుకొని పోవటంలో అతనికి ప్రత్యేకమైన నేర్పరి తనముంది. ఆ నేర్పరితనం ఇక్కడ యెంతమాత్రం పనిచేయలేదు. అతని దస్తూరికి, పనికి, నడతకి, వేషానికి చివాట్లుతినని రోజేలేదు. అంతకంతకూ ఆఫీసు ఒక నరక కూపంలాగ కనబడుతోంది. తప్పించుకునే ఉపాయం లేదు. చివరకు ఒకరోజున తాసిల్దారును యెదిర్చి ఒక బ్లాక్‌మార్కును కూడా సంపాదించుకున్నాడు.

అతనికి పది పుష్కరాలకుకూడా ప్రమోషను వచ్చే సావకాశం కనపడలేదు. తనవంటి బి. యే.లు పెస్టులు ప్యాసైనవారు అసంఖ్యాకంగా వున్నారు. వారిలో చాల మందికి తలలు కూడా నెరిసేయి. వారింత వరకూ గుమాస్తాలుగానే వున్నారు. ఇంత మందిని తప్పించి తనకు ప్రమోషను ఇవ్వటానికి తనలోవున్న ప్రత్యేకత యేమిటీ? తనకు ప్రమోషను రావటం అసాధ్యమని





తెలుసుకోవటానికి అట్టే కాలం పట్టలేదు. ఇక తాసిల్దారు అన్నది తనకు ఆసించటానికి కూడా వీలులేని పదవి. దానితో పొంగిపోయే గర్వం పూర్తిగా అణిగిపోయింది.

"ఉద్యోగం యెల్లాగ వుందిరా బ్రదర్" అన్నాడు కృష్ణారావు.

"ఏం వుద్యోగం రా, గతిలేనివాళ్లు చేయవలసిన పనికాని" అన్నాడు రాఘవరావు.

"ఏమిరా అంత నీరసంగా మాట్లాడుతున్నావు? పట్టుమని అయిదేళ్ళు కళ్లుమూసుకుని కూర్చున్నావంటే ఇట్టే ప్రమోషను వచ్చి మీదపడుతుంది. డిప్యూటీ కలక్టరై కూర్చుంటావు" అన్నాడు కృష్ణారావు.

"అటువంటి సావకాశాలు భూతద్దం పెట్టి వెదికినా కనబడటంలేదు. నాకంటె సీనియర్లు అయిదువందలమంది టెస్టులు ప్యాసై ప్రమోషన్లకోసం రెడీగా కూర్చొని వున్నారు. ఇక మన కెక్కడ వస్తుంది" అన్నాడు రాఘవరావు.

"తాలూకా ఆఫీసు గుమాస్తా గిరీ అంటే బానిసత్వమేరా. ఆత్మాభిమానం వున్నవాళ్ళెవరూ అందులో చేరకూడదు" అన్నాడు మళ్లీ.

కృష్ణారావు అసలు ప్రసంగంలోకి దిగేడు.

"నీ ఉద్దేశంలో క్రమశిక్షణ అంటె బానిసత్వం. నీ మనస్తత్వం నాకు చిన్నప్పటనుంచీ తెలుసు. ఒకరిని గౌరవించటం కానీ, ఒక గంట పట్టుమని పుస్తకందగ్గర కూర్చోవటం కాని, వేళకు స్కూలుకు రావటం కాని, గంట అయ్యేవరకూ స్కూల్లో కూర్చోవటంకాని నీకు చేతకావు. నే నీ మాట లంటున్నానని కోప్పడకు. నువ్వు గుమాస్తాగా చేరిన రోజునే తెలుసు నువ్వా పని చేయలేవని. కొర్కొలాంటి వారు చదువుకునే రోజుల్లోనే వినయం క్రమశిక్షణ మొదలైనవి అలవర్చుకున్నారు. వారికి ఈ గుమాస్తా వుద్యోగం ఒక లెక్క కాదు. వారికి ఎటువంటి వుద్యోగం వచ్చినా సమర్థతతో చేసి అధికారుల మెప్పు సంపాదించ గలరు. నువ్వు అధికారులచేత రోజూ చివాట్లు తింటున్నావని నాకు తెలుసు. ఆ అధికారులుకూడా నీవంటివారే అయి వుంటారు. కారణమేమంటే ఈరోజుల్లో విద్యార్థిదశలో మంచిజీవితానికి కావలసిన అలవాట్లు నూటికి ఒకరిద్దరుతప్ప యెవరూ నేర్చుకోవటంలేదు. అందుచేత పని మాని చేయటానికి నీవు వేసేయెత్తులు వారికికూడా [illegible] తెలుసు. అయితే వారు నీకంటె ముందు ఉద్యోగంలో ప్రవేశించటంచేత నీలాగే మొదట్లో బాధపడినా కొంత

కాలంలో క్రమశిక్షణకు అలవాటు పడతారు. అంతే తేడా" అన్నాడు.

రాఘవరావు యేమీ మాట్లాడలేకపోయేడు. కారణమేమంటే కృష్ణారావు మాటలాడేదాంట్లో కొంతవరకూ నిజం లేకపోలేదు. తను రోజూ తిట్లు తింటున్నట్టు కూడా తెలుసుకున్నాడు. ఆవులిస్తే పేగులు లెక్కపెట్టేటట్టున్నాడు.

"కృష్ణారావు మళ్ళీ ప్రారంభించేడు."

"నీవేమీ అధైర్యపడక్కర్లేదు. నువ్వు ఏవిషయాల్లో కొరతగా వున్నావో అవి నేర్చుకునేందుకు ప్రయత్నించు. అదృష్టం కలిసివస్తే నీకూ, నీ అధికారులలాగే ప్రమోషను వస్తుంది. కానీ పూర్వపుపద్ధతులలోనే నిలదొక్కుకోవటానికి ప్రయత్నిస్తే యెంత అదృష్టమున్నా పైకి రావటం అసంభవం - నేనుకూడా నీలాగే క్లాసులో అల్లరిచేస్తూ వుండేవాడిని. అయితే నేను చేసేది అల్లరనీ, అది తప్పనీ నాకు తెలుసు. అది నీకు తెలియదు. నా తప్పుని అదుపులో పెట్టుకోగల శక్తి నాకుంది. నీకులేదు. శర్మకు అసలు అటువంటి బుద్దే లేదు. అందుచేత మనం ముగ్గురం ఒకేక్లాసులో ప్రవేశించినా జీవితాలు మూడు రకాలుగా వెడుతున్నాయి. ఈరోజు నే చెపుతున్నాను శర్మ మన యిద్దరికంటె చాల పెద్ద వుద్యోగంలోకి వెడతాడని."

ఈఉపన్యాసానికి రాఘవరావు మాట్లాడలేకపోయేడు. శర్మ ఆశ్చర్యపోయేడు.

కొన్ని రోజులకు రాఘవరావు ఆ తరువాత కృష్ణారావు వారి ఉద్యోగపు పనులమీద వెళ్ళిపోయేరు.

ఒకరోజున యూనియన్ పబ్లిక్ సర్వీసు కమీషనువారివద్దనుంచి హాల్ సర్టిఫికేటు మొదలైన కాగితాలు వచ్చేయి. అయితే వాటిసంగతి యింట్లో యేమీ ప్రస్తావించలేదు. తనేదో ఉద్యోగపు ప్రయత్నంమీద మెడ్రాసువెళ్లవలసివుందనిమాత్రంచెప్పేడు.

"ఈ యేడు మనకేమీ కలిసిరావటంలేదు అందుచేత ప్రయత్నాలు ఈ యేటికి మానటం మంచిది." అని యింట్లో వారు సలహా యిచ్చేరు.

"మెడ్రాసు వెళ్ళడం కుక్కదండగ" అన్నాడు శర్మతండ్రి.

"మనం చేసే దండగల్లో యిదొకటి" అన్నాడు శర్మ.

ఆరోజు రాత్రి శర్మ భోజనం మానివేసేడు. తల్లి యేదోవిధంగా తండ్రిని వొప్పించే బాధ్యత తనమీద వేసుకుంది. రాజ్యం పుట్టింటినుండి తెచ్చుకున్నవి తన దగ్గరవున్నవి కలిపి యాభైరూపాయలవరకూ వున్నాయి. అవి తీసుకుని శర్మ మెడ్రాసు వెళేడు. వెళ్ళేముందర తను ఫలానా పరీక్షకు వెడుతున్నట్టు యింటిదగ్గర చెప్పటం మంచిదేమో అనుకున్నాడు. కాని తల్లితండ్రులకేమిచెప్పినా ఒకగంటలో ఆవార్త వూరివారందరకూ తెలిసిపోతుంది. తను ఐ. ఏ. ఎస్ పరీక్షలకు వెడుతున్నట్టు వారెవరికీ తెలియటం తనకు యిష్టంలేదు. తను పరీక్షకు సరిగా ప్రయత్నం చేయలేదు. "ఫలితాలు మనచేతిలో లేవు. ప్రతివారి దృష్టిలోనూ పడటం అనవసరం" అనుకున్నాడు.

మెడ్రాసులో మొదటిరోజున పరీక్షహాలువద్ద మేథమెటిక్సు లెక్చరర్ కనిపించేడు. తర్వాత తన హోటలు రూం వదలి ఆ లెక్చరర్ వున్న హోటల్ లోనికే తన బసను మార్చివేసేడు. పేపర్లు తను అనుకున్న దానికంటె బాగానే వ్రాశాడు. ప్రశ్నలు యేమంత కఠినంగా లేవనుకున్నాడు. మెడ్రాసులోవుండగా ఉద్యోగ ప్రయత్నాలమీదవున్న అనేకమంది యువకులు కనపడ్డారు. వారి ప్రవర్తనలు చూసి "కృష్ణారావు చెప్పినది అక్షరాలా నిజం. వీరిలో చాలామందికి నడతలో యెటువంటి శిక్షణాలేదు. వీరు యే వుద్యోగాలలో ప్రవేశించినా దేశానికి ప్రమాదమే. నిరుద్యోగసమస్య తీవ్రమాతోందని ప్రభుత్వాన్ని నిందించి ప్రయోజనంలేదు. పనికిరాని వారందరకూ రెండింగీషుముక్కలు నేర్చుకున్నారన్న కారణంతో ఉద్యోగాలివ్వటం ప్రభుత్వం పనికాదు. విద్యార్థిదశలోనే వీరికి సరియైన శిక్షణయిచ్చే బాధ్యతను ప్రభుత్వమే స్వీకరించాలి" అనుకున్నాడు.

ఇంటికి జేరిన తర్వాత "ఉద్యోగప్రయత్నాలు యేమైనాయి" అని తల్లీ భార్యా అడిగేరు. తండ్రి యేమీ కలుగజేసుకోలేదు. శర్మమాత్రం చాలా ఉత్సాహంగా వున్నాడు.

"ఉద్యోగం వచ్చేదీ రానిదీ ఇప్పుడప్పుడే తెలియదు. వారు తర్వాత తెలియజేస్తారు. బహుశా నన్ను మళ్ళీ పిలుస్తారనుకుంటాను" అన్నాడు.

తర్వాత కృష్ణారావు ఆ వూరు వచ్చినప్పుడు శర్మ తన మెడ్రాసు ప్రయాణం గురించి పరీక్షల్ని గురించీ చెప్పేడు. మెడ్రాసులో మేథమేటిక్స్ లెక్చరర్ కనపడ్డారనీ తనకు యెంతో సహాయం చేసేడనీ చెప్పేడు. తర్వాత అనుకున్నట్టుగా ఎభై రూపాయలు తిరిగి ఇవ్వలేకపోయాననీ వీలు చూసుకొని యిచ్చివేయగలననీ చెప్పేడు.

"నీకు కలెక్టరుద్యోగం రాకమానదు. నేను నీదగ్గర తీసుకోకమానను. నువ్వు కంగారు పడక్కర్లేదు" అన్నాడు.

రెండు మూడు నెలలు గడిచేయి. ఒకరోజున ఐ. ఏ. ఎస్ పరీక్షకు ఇంటర్వ్యూకి నిమిత్తమై రావలసిందని ఆహ్వానం వచ్చింది. ఆహ్వానం వచ్చేటప్పటికి శర్మ యింటిలో లేడు. కార్డు శర్మ తండ్రి చేతిలో పడింది. ఆయన చూసి ఆశ్చర్యపోయేడు. తనలో నవ్వుకున్నాడు. ఈ సంగతి తనతో చెప్పకూడదా? చెప్పిన తను వద్దంటాడా?

ఇంతలోకే శర్మ వచ్చేడు. తను ఐ. ఏ. యస్. పరీక్షలకు వెడుతున్నట్టు యెవరికీ తెలియటం తన కిష్టంలేదన్నాడు. "ఇంటిలోని వార్తలు ఇంటిలోనే వుండక వూరంతా ప్రాకిపోయే పరిస్థితులిక్కడ వున్నాయి. రాఘవరావుకు గుమాస్తా వుద్యోగం రాగానే డిప్యూటీ కలక్టరైనట్టు

(43-వ పేజీ చూడండి)



సామ్రాజ్య పతనానికి సాక్షిగా నిలిచిన తుంగభద్ర (హంపివద్ద




# తేనెపాప

వేజండ్ల సాంబశివరావు

పూలనుండి తేనెటీగ
సెలవుకేమి తెచ్చును ?

తియ్యతేనె సంతరించి
రివు రివ్వున వచ్చును—

పొలము వెళ్ళి నట్టి తండ్రి
సెలవుకేమి తెచ్చును ?

కాయకష్ట ఫలితమౌను
రూకఒకటి తెచ్చును—

సెలవులోన తల్లియేమి
కొలువుల్లో సేయును ?

రట్టులేక కాపురమ్ము
గుట్టుగాను సేయును—

పకపకమని నవ్వుచున్న
పాపయేమి చేయును ?

తేనెటీగ నడిగితియ్య
తేనెకొంత త్రాగును.



# సింహ సేనాపతి

బుద్ధుని కాలంలో వైశాలీ రాజ్యాన్ని లిచ్ఛవీ రాజులు పాలిస్తూవుండేవాళ్లు. వీరు సూర్య వంశపురాజులు. బుద్ధుడు గూడా సిద్ధార్థుడుగా సూర్య వంశస్థులైన శాక్యరాజుల వంగడంలో పుట్టాడు. అందువల్ల వారికి, వీరికి చుట్టరికాలు అవీ అన్నీ వున్నాయి.

సిద్ధార్థుడు ఇంటిలోంచి వెళ్లి, గయలో బోధివృక్షంక్రింద సంబుద్ధియై, నూతనమైన బౌద్ధధర్మాన్ని ప్రపంచిస్తున్న రోజులు అవి. బుద్ధుడు మగధలో ధర్మప్రచారం చేసుకుంటూ, చేసుకుంటూ, పాటలీగ్రామం మీదుగా వైశాలీ నగరాన్ని చేరుకుంటూ వుండగా, ఆయనకంటే ముందే ఆయన ఘనత, గొప్పతనం, మహిమలు అన్నీ లిచ్ఛవీ రాజకుమారులకు, ప్రజలకు వినబడుతూ వచ్చాయి. బుద్ధభగవానుడు వైశాలీ నగరాన్ని చేరుకుని, మహావనంలో వున్న కూటాగారంలో విడిదిదిగి, ధర్మప్రచారం చేయటం ప్రారంభంచేశారు. లిచ్ఛవీ రాజకుమారుల్లో పరువు ప్రతిష్ఠగలవారంతా బుద్ధుడు చెబుతున్న ఈ ధర్మాని గురించే చర్చలు, మన్ననలు మొదలు పెట్టారు.

ఒకరోజున రాజసభలో ఈ ప్రసక్తివచ్చింది. ఆ సభలో ప్రతి రాకుమారుడు బుద్ధుని గుణాలను గూర్చి, బుద్ధుడు చెప్పే ధర్మం యొక్క ప్రాశస్త్యాన్ని గురించి, బుద్ధుడు నిర్వహిస్తున్న సంఘం యొక్క ప్రశస్తినిగురించి ఒకటే మెచ్చుకోవడం; మరొకమాట లేదు. ఆ సభలో కొంతమంది జైనులుగూడా వున్నారు. సింహ సేనాపతి అని లిచ్ఛవీ రాజుల సేనాపతిగూడా వున్నాడు. సింహసేనాపతికి ఈమాటలు విన్న కొద్దీ ఇట్లా అనిపించింది. "నిజంగా ఈ బుద్ధుడు అర్హతుడు. నిస్సంశయంగా ఈ బుద్ధుడు సమ్యక్ జ్ఞాని. నిశ్చయంగా ఈ బుద్ధుడు సంబుద్ధి. లేకపోతే ఇంత

గోవిందులవారి సాంబశివరావు

మంది సుప్రతిష్ఠితులయిన లిచ్ఛవీ రాజకుమారులు ఆయన్ను గూర్చి ఇంత ఇదిగా ఎందుకు సమ్మోగ్ధులవుతారు? మెచ్చుకుంటారు? అట్టి మహాపురుషుని దర్శనం చేసుకోని నా జన్మ ఎందుకు?" అని.

## 2

సింహ సేనాపతి జైనుడు. జైనుల్లో నిగంఠనాథుని శిష్యుడు. జైనులకు, కొత్తగా పైకివస్తున్న బౌద్ధులకు ఆ రోజుల్లోనేకాదు, ఆ అనంతరంగూడా సరిపడినట్లు ఎచ్చటా కన్పించదు. ఎప్పుడు ఆ విషయం ఎట్లావున్నా, ఆ రోజుల్లో జైన సన్యాసులకు శాక్య పుత్రీయులైన బౌద్ధభిక్షువులకు మధ్య పచ్చగడ్డి వేస్తే మండిపోతూవుండేది. ఈ సంగతిని అంతా బాగాయెరిగిన సింహ సేనాపతి ముందుగా గురువు ఆజ్ఞ పుచ్చుకు పోదామని నిగంఠనాథుని ఆశ్రమానికి వెళ్లాడు. వెళ్లి ఆయనకు నమస్కారాది మర్యాదల నెరపి "స్వామి! నేడు శ్రమణుడైన బుద్ధుణ్ణి చూట్టానికి పోవా లనుకుంటున్నాను" అన్నాడు.

గురువు నిగంఠనాథుడు విస్తుపోయాడు. "సింహా! నీవు క్రియావాదివి. బుద్ధుడు అక్రియావాది. క్రియావాదివైన నువ్వు ఏ విధంగా అక్రియావాదియైన గౌతముణ్ణి చూద్దామని పోతున్నావు? బుద్ధుడు శ్రావకులకు అందరికీ అక్రియావాదాన్ని బోధిస్తున్నాడు" అన్నాడు. అయితే సింహసేనాపతికి బుద్ధుణ్ణి చూడాలన్న ఇచ్ఛ ఉరువేలంగా వుండిపోయింది. గురువుమాటను చెవిని పట్టించుకోక పోవడమూ మర్యాదగా కన్పించలేదు. అందువల్ల అప్పటికి ఆయన ఆ కోర్కెను అణుచుకున్నాడు.

# ★ సింహ సేనాపతి ★

### 3

సింహ సేనాపతి రాచకార్యం మీద రోజూ రాజసభకు పోతూ వుండాలి. స్కంధావారానికి పోయి సైన్య వ్యవహారాలను చూచుకుంటూ వుండాలి. ఇందులో ఎక్కడికి వెళ్ళినా అక్కడి వారు బుద్ధుణ్ణిగూర్చి బుద్ధుని గుణాలనుగూర్చి, బుద్ధుని మహిమలను గూర్చి తప్ప మరోమాట మాట్లాడు కోవడం లేదు. రాజసభలోను సైనిక స్కంధావారాల్లోను గూడా ప్రసిద్ధులయిన రాజకుమారులు అందరి నోటివెంట బుద్ధుణ్ణి గూర్చిన ప్రశంస తప్ప మరోటి వినరావడం లేదు. ఇవి వింటున్న కొద్దీ సింహ సేనాపతిలో శాక్యఋషి గౌతముణ్ణి చూద్దామన్న వాంఛ మిక్కుటం కాజొచ్చింది. తిరిగి ఒకరోజున ఆయన జైన నిగంఠుణ్ణి దర్శించి తనలోనియిచ్ఛను వ్యక్తంచేశాడు. తిరిగి ఆయన 'నీవు' క్రియవాదివి, అక్రియవాదియైన గౌతముణ్ణి ఎట్లా చూస్తావు అని అపవారించాడు. మళ్ళీ ఆయనలో ఈ కోర్కె శాంతించింది.

శాంతించిందేగాని, ఆ కోర్కె ఈ మనస్సులో పచ్చి ఆరలేదు. రోజూ రాజసభలో స్కంధావారంలో బుద్ధుణ్ణిగూర్చి ప్రశస్తినే వింటూవుండటంవల్ల అది దినము, దినము స్పైలవేసింది. నిగంఠనాధుడు బుద్ధుణ్ణి చూడ్డానికి తన్ను అనుమతిస్తాడేమోనని సేనాపతి ఆయన్ను మూడోసారిగూడా అడిగి చూచాడు. మూడోసారి గూడా నిగంఠ జైనుడు బుద్ధుని దర్శనం అయోగ్యం అని నిషేధించాడు.

సింహ సేనాపతికి అరికాలిమంట నెత్తికి ఎక్కింది. 'అరే; ఈ గురువు నన్ను బుద్ధుణ్ణేచూడవద్దంటాడేమి!'. అని కోపంవచ్చింది. ప్రసిద్ధులు, అప్రసిద్ధులు అంతాపోయి ఆయన్ను చూసివచ్చి, ఆ చూచివచ్చిన ఆనందంయొక్క స్మృతిచేతనే అంతగా ముగ్ధులై పోతూవుంటే, ఈ గురువు, తన్ను పోనీయడేమి అని ఆయనకు కోపంవచ్చింది. ఇక ఈసారి చెప్ప



టం, గిప్పటం లేదు. పోయి చూచి రావటమే అని సింహ సేనాపతి మనస్సులో నిశ్చయం చేసుకున్నాడు.

## 4

బుద్ధుణ్ణి చూట్టానికని బయలుదేరిన సేనాపతి ఏడువందల రథాలు వెంటరాగా బయలుదేరాడు. రోజు రోజల్లా ప్రయాణం చేసి, గౌతముడు విడిసివున్న ఆరామాన్ని చేరుకున్నాడు. బుద్ధుడు ఎక్కడ వున్నాడో అక్కడకు వెళ్ళి భగవానుడికి నమస్కారం చేసి, ఒక ప్రక్కగా ఆసీనుడై సంతుష్టిని పొందాడు.

బుద్ధుడు ఆయన్ను కుశల ప్రశ్నాదికాలు అడిగి, మాటను ధర్మప్రసంగంలోకి మార్చాడు. అప్పుడు సింహ సేనాపతి అన్నాడు గదా: "స్వామీ, మిమ్మల్ని గురించి ఇట్టి మాటలు వింటున్నాము. శ్రమణుడైన గౌతముడు అక్రియావాది. అక్రియను ఒక ధర్మంగా ఉపదేశిస్తున్నాడు. ఆయనదగ్గర శిష్యులెవరు చేరడం లేదు. ఇట్టిమాటలు వింటున్నాను. మరికొందరు అంటున్నారుగదా గౌతముడు అక్రియావాదాన్ని ఉపదేశించడమే కాదు ఆయనగూడా వట్టి అక్రియావాదేనని. ఇది నింద అనుకోవద్దు, విన్న మాటలు విన్నట్లు చెబుతున్నాను. మిమ్మల్ని నిందించడం నా మతం కాదు" అని.

"సింహా! నీకు నేను అక్రియావాదినని అనుమానం వున్నదా!" అని బుద్ధభగవానుడు చిరునవ్వు నవ్వాడు.

"ఆ అనుమానం తీర్చుకుందామనే గదా వచ్చింది" అన్నాడు సింహ సేనాపతి.

"అవును! అనుమానం కలగడం సహజమే. నేను చెబుతున్న ధర్మంలో కొంత అక్రియగా కన్పించేదివుంది. ఇక నీకు జైనులు తోడయెను. అందువల్ల అంతా అక్రియగానే భాసిస్తుంది" అని మెల్లగా హసించాడు బుద్ధుడు.

"అంటే మీ ధర్మంలో కొంత అక్రియగూడా వున్నదంటారు?" అని ప్రశ్నగా కన్పించకుండా సేనాపతి ప్రశ్నించాడు. భగవంతుడైన బుద్ధుడు ఇల్లా సమాధానం చెప్పాడు.

"సింహా! కాయదుశ్చరితం, వచనదుశ్చరితం, మనోదుశ్చరితం పనికిరాదంటాను. అట్లాగే అనేకమైన పాపాలను చెయ్యవద్దంటాను. మంచిపని చెయ్యకపోయినా చెడుపని చేయకుండా వూరుకోవడం మంచిదంటావా! కాదంటావా? ఇదే అక్రియా అయితే, జైనులు చెబుతున్న క్రియావాదం కన్నా, నాయీ అక్రియవాదమే ధర్మవిహితం అని తేలడం లేదా."

"సింహా! ఇది గౌతమశ్రమణుని అక్రియావాదం. క్రియావాదం గూడా బుద్ధుని మతంలో చాలా వుంది. ఈ క్రియకోసమే ధర్మోపదేశం జరుగుతున్నది. నేను కాయసుచరితాన్ని బోధిస్తున్నాను. కాయసుచరితం అంటే అహింస, మనస్సును వ్యభిచరించకుండా పట్టుకోవడం. దొంగబుద్ధి లేకుండా వుండటం.

అట్లాగే వాక్సుచరితం కావాలంటున్నాను. అంటే సత్యం చెప్పమంటున్నాను. నోరు పారవేస్తుకోవడం, మాటల్లోకి కాఠిన్యాన్ని రానీయడం తగదంటున్నాను. అట్లాగే మనసాసుచరితం వ్యక్తమానం కావాలంటున్నాను. అంటే లోభచింత, ద్రోహచింత మొదలైన దుష్టవిశేషాలను వదిలిపెట్టి సమ్యగ్దృష్టిని అలవరుచుకోమంటున్నాను. ఇది ఉత్తమ ధర్మంయొక్క క్రియారూపం అని చెబుతున్నాను. ఈ విధంగా గౌతముడు క్రియావాదిగూడాను.

"సింహా! ఇది నువ్వు విన్నావో లేదోగాని, కొంతమంది నన్నుగురించి నాతోనే ఇట్లా అంటూవుండటంవుంది. "గౌతముడా! నీవు చెప్పే ధర్మం మమ్మల్ని ఆశ్వాసిస్తున్నట్లు వుంటుంది. దుఃఖాన్ని నివారించేదివలె వుంటుంది. నేను అట్టి విధంగా లోకాన్ని ఆశ్వాసించడం కోసమే ధర్మబోధ చేస్తున్నాను. అందువల్లనే ఇంతమంది శ్రావకులు నా ధర్మాన్ని అవలంబిస్తున్నారు.

## 5

బుద్ధుని ఈ ధర్మోపన్యాసం సింహ సేనాపతిని ముగ్ధుణ్ణి చేసింది. అతని మనస్సులో ధర్మపువాసనలను గాలిలాగా వూదింది. "భగవానుడా! ఆశ్చర్యం! ఇదిగదా ధర్మం అంటే! నన్ను మీ ఉపాసకులలో చేర్చుకోండి. తరిస్తాను" అన్నాడు.

బుద్ధభగవానుడు ఆ మాటలు విని కొంచంసేపు ఆలోచనా నిమగ్నుడై అనంతరం తలను ఒకసారి పంకించి "సింహా! కొంచెం ఆలోచించి మరీ ఏదన్నా చెయ్యి; నీవంటి వూరికే సంభ్రాంతులయ్యే మనుష్యులు విషయాన్ని బాగా ఆలోచించి, తెలుసు

# ★ సింహసేనాపతి ★

కున్న తర్వాత ఏమన్నా చెయ్యడం మంచిది." అన్నాడు.

"భగవంతుడా! మీ ధర్మ కథనం నన్ను చాలా సంతుష్టుణ్ని చేసింది. ఇక మీరుగాబట్టి ఇట్లా అంటున్నారు గాని, ఇంకో ఇంకో శ్రావకుడు ఎవరైనా, నావంటి శిష్యుడు దొరకగానే వైశాలి అంతా తిరిగి ఇదిగో! సింహసేనాపతి నాకు శిష్యుడైనాడు అని సగర్వంగా చాటి చెప్పకునేవాడు. కాని మీరు అట్లా చెయ్యడంలేదు, అది కూడా నన్ను సంతుష్టుణ్ణి చేస్తున్నది. భగవంతుడా! నన్ను నీ ఉపాసకుణ్ణిగా స్వీకరించు. ఇదిగో రెండోసారి నిన్ను శరణు అంటున్నాను."

ఈమాట విని భగవానుడైన బుద్ధుడు ఈలా అన్నాడు:

"సింహా! చాలాకాలంనుంచి మీ యింటివారంతా, నిగంథ జైనులను అనుసరిస్తూ వచ్చారు. నిగంఠనాథునికి మీ యిల్లు చిరకాలంనుంచి ఆశ్రయమైవుంది. ఇప్పుడు ఈ శాక్యభిక్షుని ఉపాసకుడవై అతనికి బిక్ష పెట్టనంటే, అది నాకు నచ్చదు. అట్టి కోరిక నాకున్నదని ఎన్నడూ భావించకు. అందుచేతనే నా మాటలు విని సంభ్రాంతులై పొంగేవాళ్ళను హెచ్చరిస్తూవుంటాను."

"భగవంతుడా! నా మనస్సు నీయందు ఎంత ఇదిగా అభిరతం అయ్యేట్లు చేసుకుంటున్నావు! నీలోని ఈ మహాగుణం నన్ను అతి ప్రసన్నుణ్ణి చేస్తున్నది. సంతుష్టుణ్ణి పొనరుస్తున్నది. నేను వాళ్లు వీళ్లు అంటూ వుండగా విన్నానుగదా "గౌతమ శ్రమణుడు ఉపాసకులను తనకే భిక్ష వేయమని శాసిస్తాడనీ మరి ఇంకో ధర్మాన్ని అనుసరించే భిక్షువుకు భిక్ష వేయ వద్దంటాడని. కాని ఇప్పుడు ఏమి వింటున్నాను. భగవంతుడైన బుద్ధుడు నన్ను నిగంఠజైనుణ్ణి తిరస్కరించవద్దని హెచ్చరించడం వింటున్నాను. భగవంతుడు చెప్పినదే యుక్తమనికూడా నా భావానికి తడుతున్నది. బుద్ధుడా! ఇదిగో మూడోసారి అడుగుతున్నాను.

నన్ను నీ ఉపాసకునిగా స్వీకరించు. శరణు అంటున్నాను."

## 6

ఆ అనంతరం భగవంతుడు సింహాసేనాపతికి ఆను పూర్వికధను చెప్పారు. దానకధ, శీలకధ, స్వర్గకధ చెప్పారు. కామభోగాలలో వున్న దోషాన్ని వివరించారు. నిష్కామకర్మ యొక్క మహత్వమెట్టిదో బోధించారు. మనస్సు, దాని ఆరోగ్యము అంటే ఏమిటో, అరోగ చిత్తము, మృదు చిత్తము, అనాచ్ఛాదిత చిత్తము, ఉదగ్ర చిత్తము, ప్రసన్నచిత్తము, అంటే ఏమిటో చెప్పారు. దుఃఖము, సముదయము, నిరోధము, మార్గము, ఇవి వివరించారు. ఇవ్వన్నీ వింటూ సింహాసేనాపతి కూర్చున్న ఆసనం మీద కూర్చున్నట్లే విమలుడు, ధర్మచక్షువు, ప్రసన్నచిత్తుడు అయినాడు. అప్రయత్నంగా అతని నోటివెంట ఏదిసముదయధర్మమో, అది నిరోధధర్మంగూడాను అన్న మాటలు వచ్చాయి. సింహాసేనాపతి దృష్టధర్ముడు, ప్రాప్తధర్ముడు, విహితధర్ముడు, పర్యవగాఢధర్ముడు అయినాడు. సందేహ రహితుడైనాడు. వాదంతోను, వివాదంతోను నిమిత్తంలేని చిత్తశుద్ధి ఆయనకు అప్పుడు లభ్యమైంది. విశారదత ప్రాప్తించింది. శాస్త్రయొక్క శాసనంచేత స్వతంత్రుడైనాడు.

అప్పుడు ఆయన భగవంతునితో ఈలా అన్నాడు. "భగవంతుడా మీరు సంఘసహితంగా రేపు నా ఆతిథ్యాన్ని స్వీకరించండి."

భగవంతుడు మౌనంతో ఆ ప్రార్థనను స్వీకరించారు. భగవంతుడు తన ఆతిథ్యాన్ని స్వీకరిస్తాడని తెలిసిన అనంతరం సింహా సేనాపతి ఆసనంమీదనుంచి లేచి, భగవంతునికి అభివాదనంచేసి, ప్రదక్షిణం ఆచరించి, ఇంటికి పయనమై వచ్చివేశాడు.

వచ్చినదగ్గరనుంచి రేపు భోజనానికి ఏర్పాటు ప్రారంభమైనాయి. ఒక మనిషినిపిలిచి "ఒరే! మంచి తాజామాంసం దొరుకుతుందేమో తీసుకురా" అని సింహాసేనాపతి ఆజ్ఞాపించాడు. ఆ రాత్రిఅంతా అట్లా సందడిగా నడిచిపోయింది. తెల్లవారినతర్వాత, ఉత్తమ ఖాద్యాలు, భోజ్యాలతో వంట అంతా తయారైనతర్వాత ఆయన బుద్ధభగవానుడు విడిసివున్న ఆరామానికి వెళ్ళి భిక్షకు ఆహ్వానించివచ్చాడు.

## 7

అపరాహ్ణం అయింది. భగవానుడైన బుద్ధుడు చీవారాన్ని ధరించి, పాత్రపుచ్చుకొని భిక్షుసంఘసహితంగా పాదచారియై భిక్షకు కదిలివచ్చారు. సింహాసేనాపతి ఆసనాలు అవ్వీ ఏర్పాటుచేసి వడ్డన అంతా సిద్ధం చేయించివేశాడు. భగవంతుడు భిక్షను స్వీకరిస్తున్నాడు.

ఏ సమయాన బుద్ధుడు సింహాసేనాపతి గృహంలో భిక్ష స్వీకరిస్తున్నారో, ఆ సమయంలోనే నిగంఠజైనులు వైశాలీలో ఇంటి ఇంటికి తిరుగుతూ బుద్ధునిగూర్చి సింహాసేనాపతిని గూర్చి దుష్టప్రచారం ప్రారంభంచేశారు. సింహాసేనాపతి నేడు ఒక మోటపశువునుచంపి శాక్యపుత్రశ్రమణుడికి వండిపెడుతున్నాడు. అట్లా ఈ సేనాపతి చేశాడని తెలిసికూడా గౌతమశ్రమణకుడు ఆ మాంసం తింటున్నాడు. అసలు గౌతముడే ఆ మాంసం వండించిపెట్టమన్నాడు అంటూ ప్రచారంచేశారు.

ఇదంతా కని, విని, ఒక వ్యక్తి నిజమే అనుకొని సింహా సేనాపతి యింటికివచ్చి "అయ్యా! మీరు ఇది విన్నారా ?" అని అడిగాడు.

"ఏమిటి ? విన్నది !"

"నిగంఠజైనులు చెబుతున్నది."

"ఏమి చెబుతున్నారేమిటి?"

"బుద్ధుడికి మీరు మోటపశువు మాంసం వండిపెట్టిస్తున్నారని!

"ఇంతేగదా !" అని సింహా సేనాపతి నవ్వి వూరుకున్నాడు. ఆవచ్చిన వ్యక్తికి ఆశ్చర్యంవేసింది. ఔత్సుక్యమూ కల్గింది. ఇంతేగదా అంటే ఏమిటన్నట్లు చూచాడు.

సింహాసేనాపతి ఇట్లా చెప్పాడు. "బాబూ ! ఇదంతా నీకు తెలియదు. ఈ నిగంఠజైనుడువున్నాడే ఆయన చిరకాలంనుంచీ నా దగ్గర బుద్ధుణ్ణి తిట్టడం నిందించడం ఒక పనిగా పెట్టుకున్నాడు. ఆయనకు రెండేపనులు వున్నాయి. ఒకటి బౌద్ధధర్మాన్ని నిందించడం, రెండు బౌద్ధసంఘాన్ని నిందించడం. ఆయనకు భగవంతుడయిన బుద్ధుణ్ణి అసద్వాదియని, తుచ్ఛుడని, మిథ్యావాది అని నిందించటానికి నోరు ఎట్లావస్తున్నదో తెలియకుండా వుంది. సిగ్గులేకపోతే సరి! ఇక మాంసం అంటావా, ఇది విను, మేము ప్రాణరక్షణ నిమిత్తమైగూడా ఇంకో ప్రాణాన్ని తియ్యం."

ఈ మాటలు అని సేనాపతి

(40-వ పేజీ చూడండి)

# కేరమ్‌బోర్డు

పూసపాటి కృష్ణంరాజు

"గరమ్, గరమ్" అంటూ వేడి వేడి వేరుశనగపప్పు అమ్మేవాడు సహితం సముద్రతీరంలో ఎక్కడా కనబడలేదు. రవణ ముడుచుకు కూర్చున్నాడు. శరీరం జల్లుమనిపించే చలి, సముద్రతరంగాల హోరు తప్ప ఇంకేం వినబడ్డంలేదు. బీచి అంతా ఖాళీఅయిపోయింది.

నాకుమాత్రం హుషారుగానే వుంది లోపల శరీరాన్ని పట్టి ఉన్ని స్వెట్టరు, చెవులచుట్టూ మఫ్లరుతగిన వెచ్చదనాన్ని కలిగిస్తున్నాయి.

హార్బరు కాలువలో డ్రెడ్జరు బుర్రుమని బిగులు వేసింది. ఏడున్నర దాటినట్లుంది. రవణ మోకాళ్లకు గెడ్డం ఆనించి టౌనుహాలు మీది గోపురాలను తిలకిస్తూ దీర్ఘాలోచనలో పడ్డాడు. చలి. ఇంటికి పోదామనడంలేదు. వాడినేదో వేధిస్తున్నాది. క్షణ క్షణానికీ వాడి హావభావాల్లో మార్పు కనబడుతున్నది.

తలదువ్వక నిర్లక్ష్యంగా జుత్తు చిందరవందర చేసుకున్నా, లేత వయస్సులో లేలేత వంకాయలాంటి ముఖంతో రవణ చక్కని కుర్రవాడు. ఎవరినైనా ఆకర్షిస్తాడు. చూసీ చూడ్డంతోనే వాడిమీద నాకు ఎక్కడలేని తనవాడి తనం వచ్చి ఆపేక్షకలిగింది. వాడిభోగట్టా ఇంకా నాకేం తెలియదు. కుర్రవాడు చాకులాంటివాడు. బీచిమీద కలిశాడు. ఎందుకు ఆగమ్మకాకిలాగ తయారయాడో మాత్రం తెలియలేదు.

"రవణా, ఇహ లేద్దామా?" అని నేనే అడిగాను.

"కూర్చుందురూ" అన్నాడు.

పసిపిల్లలకీ పందిరిరాటలకీ చలి వెయ్యదంటారు, ఇదే కాబోలు!

"పదా, భోజనం చేద్దాం. వేళైంది" అన్నా.

"ఐతే పదండి. నేనూ రీడింగు రూముకి పోతాను."

"ఇప్పుడు మళ్లానా ?"

"ఒక్క గేము ఆడేసి ఇంటికి పోతాను. భోంచేసి మీరూ రండి నా ఆట చూద్దురు గాని. నాతో అక్కడ ఒక్కడూ ఆడలేడు. మళ్లా వాళ్ళంతా సంవత్సరాల బట్టి ఆడుతున్నారు. నేను ఆట మొదలెట్టి గట్టిగా రెండునెల్లు కాలేదు. అందరికీ నేనంటే హడలే" అలా వల్లించేస్తున్నాడు ఉత్సాహంతో.

"నీ ఆట తప్పకుండా చూస్తాలే. ముందు పద చలిగాలికి న్యూమోనియా రాగలదు" అని వాణ్ణి తట్టిలేపి హోటలుకు బయలుదేరేను.

శివాలయం వీధిలోంచి మెయిన్ రోడ్డు చేరాము. కాకాహోటళ్ళలోని పాత గ్రామఫోను సంగీతం కర్ణకఠోరంగా వెంటాడుతున్నది. మెయిన్ రోడ్డున కూడా జనసంచారం బాగా తగ్గిపోయింది చలి సామాన్యంగా లేదు. బిచిని అంతసేపూ నేనైతే వెచ్చని కాఫీ తాగి, వెచ్చని దుస్తులతో కూర్చోగలిగాను, సిగరెట్లసహాయంతో రవణ వాడికన్నా కాస్త పెద్దవాణ్ణని సందేహించి కాల్చలేక పోయాడో! లేక నిజంగా కాల్చడో! సిగరెట్టు కాల్చననే చెప్పాడు.

ఆ చలిలో నిక్కరు, పొట్టిచేతుల బుష్ కోటు, లోపల బనీనేనా లేకుండా వున్నా ఎలాగంతసేపు సముద్రపు రొజ్జలో కూర్చున్నాడో నాకు ఆశ్చర్యంగానే వుంది.

"ఈవాళ మనిద్దరం హోటల్లో భోంచేద్దాం" అన్నాను.

"ఒద్దండీ, ఎందుకూ డబ్బుదండగ" అన్నాడు.

"ఫరవా లేదు లే."

"రీడింగురూముకి పోతానండి. ఒక్క బెట్టు కొట్టేసనంటే బేడ వుడాయిస్తాను."

"ఇవాల్టికి రా" అని బలవంతంగా హోటలుకి నెట్టుకుపోయాను. భోంచేసి ఇద్దరం బయటకొచ్చాము. ఇంకా రీడింగురూము కోలాహలంగానే వుంది.

"ఏయి రవణా, కేరంబోర్డు ఆడతావా ?" అన్నాను.

"ఆడనండీ" అన్నాడు.

"అదేమిటి, ఆడతానన్నావు ? నన్ను చూడమన్నావు వెయ్యి ఒక గేము."

"ఇహ నేను కేరమ్‌బోర్డు ముట్టుకుంటే ఒట్టు" అని శపథం చేశాడు. అప్పటికప్పుడే అంతమార్పు ఎందుకు వచ్చిందో ! అంతా చంచల చిత్తం కుర్రవాడు, ఇంకా-మానసిక నిశ్చలత రాలేదు.

"అలాగ నిన్ను వదులుతానా.

నీ ఆట చూడనిదే ఇవ్వాళ నేను లాడ్జికి వెళ్ళను."

"ఒద్దండీ, బెట్టు వెయ్యందీ వాళ్లు ఆడనివ్వరు. నా దగ్గర బేడ డబ్బులేనా లేవు. పో నిద్దురా" అన్నాడు.

"నే నిస్తాను పద" అని వాణ్ణి వెంటుకొని రీడింగురూములో ప్రవేశించాను.

"ఏమిరా, ఆడతావా? పొద్దున్న లాగనుకున్నావు కాబోలు. ఆ పప్పు ఉడకదు. బేడ బేడ పందెం" అన్నాడు ఒక వుంగరాల జుత్తు లతను ఛాలెంజి చేస్తూ ముందుకు వచ్చాడు. కేరమ్‌బోర్డులు నాలు గైదు చోట్ల ఆడుతున్నారు.

"రా, బస్తీమే సవాల్" అని గబగబా కోడిపుంజులాగ వెళ్లేడు.

వుంగరాల జుత్తువాడు, రవణా కొత్త టేబిలుదగ్గర కూర్చుని ఆట ప్రారంభించారు. ప్రక్కని కుర్చీలో కూర్చుని చూస్తున్నాను. ఆట ప్రారంభంనుండి చూడ్డానికి ముచ్చటగా వుంది. చాలా నీటుగా రవణ పాయింట్లు తీస్తున్నాడు. నసుగులేకుండా, గురి చూసుకోడా నికి వేళ్లు సవరింపైనా లేకుండా చక చక కొడుతున్నారు. రెండు చేతులా ఒక్కలాగ ఆడుతున్నాడు. బోర్డు రెండోసారి తనకి ఆట రాగానే అయిపోయింది. రెడ్డుతో సహా ఏడు మార్కులు రవణ కొట్టేశాడు.

ఆశ్చర్యం! రవణా, వుంగరాల జుత్తువాడు ఆట ప్రారంభించగానే బోర్డు చుట్టూ ఆట చూడ్డానికి రీడింగురూములో వున్న కేరమ్ బోర్డు ఆటగాళ్ళంతా వలయంకట్టి కిక్కిరిసిపోయారు. వాళ్లంతా గుమి



"ఇహ నేను కేరమ్‌బోర్డు ముట్టుకుంటే ఒట్టు" అని శపథంచేశాడు.

గూడడం నా చైతన్యంలో లేకుండా నే అయిందు. రవణ ఆట నన్ను మైమరపించేసింది. ఉంగరాల జుత్తు వాడిదగ్గర బేడ రవణ పుడయించాడు. ఇద్దరంకలిసి బైటికి వచ్చే సరికి పది దగ్గర అవుతున్నది.

"మీ ఇల్లు ఎక్కడ?" అడిగాను.

"అబ్బో, చాలాదూరం అల్లీపురం."

"ఇప్పుడు కాళ్ళీడ్చుకుంటూ నడిచిపోగలవా? మా లాడ్జికి వచ్చేయి. పొద్దున్న వెలుదువుగాని" అన్నాను. "అంతకన్నానా, పదండి" అని నాతో వచ్చేశాడు.

సరికొత్త స్నేహితుడు. బీచిని

# కేరమ్‌బోర్డు

రెండుమాటలు కలిశాయో లేదో అంత జోస్తీ రెండుమూడు రోజుల్లోనే ఏర్పడిపోయింది.

లాడ్జి తలుపుతీసి స్విచ్చి నొక్కి బోల్డాలును ఒక్క కిక్కుతన్నేను. పరుపుచుట్ట విడి యథాస్థానాన్ని పరచుకొంది. అందులో జంబుఖానా పైకితీసి ఒక తలగడా తీసి రవణకిచ్చాను. బీచిని చాలసేపు చలిలో వుండడాన్నేమో గదిలో వెచ్చదనం తగలగానే నడుం వాల్చాలనిపించింది.

"రవణా, నువ్వు చక్కగా పాడతానన్నావు. పాట విందామనే వుంది. కాని కునుకు వచ్చేస్తున్నాది." అని లుంగీ వేసుకున్నాను. రవణ జంబుఖానా పరుచుకొని బోర్లా పడుకున్నాడు. తలగడా మీద మొహంపెట్టుకొని వలవల ఏడుస్తున్నట్లు కనబడ్డది.

"రవణా, ఏయ్ రవణా" పిలిచాను. నిస్సందేహంగా రవణ ఏడుస్తున్నాడు.

"ఏమోయ్, ఎందు కేడుస్తున్నావ్ ?" వాడు జవాబు చెప్పలేదు. వెక్కుతున్నాడు. నాకు అర్థంఅయింది. కుర్రవాడు. చెప్పకుండా చెయ్యకుండా రాత్రి తిండికైనా వెళ్ళకుండా వుండిపోతే చీవాట్లు వస్తాయి. నేను చేసింది పొరపాటే. వాడిని దూరమైనా సరే ఇంటికి పొమ్మనాల్సింది. ఇంతకీ మించిపోయింది లేదు.

"రవణా, నువ్వు ఇంటికి పో. నిజమే మీవాళ్లు చీవాట్లు పెడతారు. ఎక్కడి కెళ్ళావో తెలియక బెంగ పెట్టుకుంటారు. ఒక్కడివీ వెళ్ళగలవా, తోడు రమ్మన్నావా?" అని అడిగాను. వాడు చటుక్కున లేచాడు.

"ఎవ్వరూ నాకోసం బెంగపెట్టుకోరు. భోజనానికి వెళ్ళకపోతేనేం, వెళితేనేం. ఇంటిదగ్గిర అన్నం ఒకటి ఈరాత్రి వొండేరో లేదో! మీ ధర్మమా అని కడుపునిండా నేను అన్నంతిన్నాను. ఇంటికెళితే పస్తు పడుకుందునేమో. నేను రాత్రిళ్లు ఎగపెయ్యడం ఇది మొదటిసారి కాదులెండి" అన్నాడు.

నాకు ఎక్కడలేని విచారం ముంచుకొచ్చింది.

"ఐతే ఎందు కేడుస్తున్నావు ?"

"మా ప్రారబ్ధానికి. మా నాన్న ఉద్యోగంపోయింది. పడరాని కష్టాలు పడుతున్నాం. నా చదువు ఎగనామం పెట్టేసింది. ఎక్కడా ఉద్యోగం అయినా దొరకడం లేదు. ఈ రాత్రి నేను కడుపునిండా కూరలు, పచ్చళ్లు, పులుసు, పెరుగు వేసుకొని భోంచేశాను. అందుకు దుఃఖం వొచ్చేసింది. ఆపుకోలేకపోయాను" అని బుగ్గలనిండా నీళ్లు కార్చుకుంటూ కూర్చున్నాడు.

రెండురోజులై బీచిలో కలుస్తున్నాడు. అంత బాధపడుతున్న వాడిలాగ నాకు కనబడలేదు. నిర్విచారంగా కిలకిల నవ్వుతూ, నిశ్చింతగా, కోమలంగా, అమాయకంగా ఏ బాధాబందీలేని కుర్రవాడుగానే నాకు కనబడ్డాడు. కేరమ్‌బోర్డు ఆడుకుంటూ చదువూ సంధ్యా మాని తెలివితేటలుండీ చెడిపోతున్న కుర్రవాడని అనుకున్నాను. కాస్త దారిలో పెడదాము, పెడమార్గం తప్పిద్దాం అనికూడా అనుకున్నాను. కథంతా అడ్డంతిరిగింది.

"రవణా, ఏడవకు నన్ను చూస్తున్నావా ? నేను నీకన్నా ఎక్కువ కష్టాలుపడ్డాను. నీకు తలిదండ్రులున్నారు. బాధలు వాళ్ళు పడతారు. ఇంతకీ స్కూలుఫైనలు పాసయ్యావు. ఎక్కడో ఏదో చూసుకుంటావు. కొంచెం ఓరిస్తే కాలం తిరగబడుతుంది. పడుకో. పొద్దున్న నీకు చిన్న ఉద్యోగం వస్తుందేమో చూద్దాం" అన్నాను. అన్నానుకానీ కష్టమే. నాకే సరియైన ఉద్యోగంలేదు. ఉంటుందో వూడుతుందో తెలియని కొలువు చేస్తున్నాను.

"ఎందుకు మీరు బాధపడతారు, ఎప్పుడో ఒకనాడు ఏరాతి కొండ ఎక్కి ఒక్కదూకు దూకేస్తాను. పీడ పూర్తిగా వొదిలిపోతుంది" అన్నాడు నా ప్రాణం చివుక్కుమంది.

"తప్పు రవణా. చెప్పేనుగా కష్టాలు కొనవరకూ వుండవు. కాస్త వస్తాయించాలి. పడుకో. పొద్దున్న చూసుకుందాం కదూ——" అని ఓదార్చి పడుకోబెట్టాను.

ఆ రాత్రంతా నేను సరిగా నిద్రపోలేదు. ముసుగు తన్ని పడుకొన్నాను. కాని కళ్లు మూతలు పడలేదు. బాగా తెలివొచ్చిచూస్తే పొద్దున్న ఎనిమిదిగంటలైనట్లుంది. పక్కని రవణ లేడు. లేచిచూస్తే వరండాలోనూ లేడు. తొందరగా



# కేరమ్ బోర్డు



మొహం కడుక్కొని బయటకు బయలుదేరేను. నాకు గట్టిగా అనుమానం పట్టుకుంది. ఈ కుర్రవాడు ఏ అఘాయిత్యమో చేశాడేమోనని నన్ను అనుమానం పీక్కు తింటున్నది. రీడింగురూములోనూ లేడు, పరిసరాల్లోనూ లేడు. వాడికోసమని ఇప్పుడెక్కడని గాలించను!

చటుక్కున ఇంకో ఆలోచన తట్టింది. జేబులో పర్సు చూసుకున్నాను. వుంది. పర్సులో డబ్బు కూడా భద్రంగానే వుంది. ఐతే పర్సు హోల్డాలు లోపలికి తోసేసి పడుకోవడం అలవాటు. అనుమానంతోటి తిరిగి లాడ్జికి వెళ్లేను గదిలో ఖరీదైనబట్టలు, బిగ్ బెన్నూ మొదలైనవన్నీ భద్రంగానే వున్నాయి. ఈ వింత ఆలోచనకి నామీద నాకే అసహ్యంవేసింది. పాపం రవణ దొంగకాడు, దొరే!

ఆ సాయంకాలం ఉద్యోగం నుండి తిరిగివచ్చాక రవణకోసం రీడింగురూముకి వచ్చాను. ఆ రోజంతా ఆఫీసులో రవణమీదే మనస్సు. ఏరాడ కొండమీదనుంచి సముద్రంలోకి దూకుతూ వుంటే అడ్డుకొనేవారు ఎవరూ వుండరు. రీడింగురూములోకి గుండె గడ గడలాడుతూ వెళ్ళేను. ఏ వార్త వింటానో అనే భయం.

లోపలికి వెళ్ళగానే అతి వుల్లాసంగా, నిశ్చింతంగా మైమరచి అక్కడ రవణ కేరమ్సు ఆడుతున్నాడు. పట్టరాని సంతోషం ఉబికింది. "రవణా" అని గట్టిగా అరిచాను.

వాడు తలెత్తిచూస్తే జాలిగా కనబడ్డాడు.

"రండీ, పొద్దున్న మీరు నిద్రపోతున్నారు. లేపడం ఇష్టంలేక ఇంటికివెళ్ళేను. క్షమించండి" అన్నాడు. వెంటనే తలదించుకుని, చుట్టూ అతని ఆటని చూసి ఆనందిస్తున్న ప్రేక్షకులనైనా గమనించకుండా ఆటలో పూర్తిగా నిమగ్నమైపోయి స్ట్రైకరుని నిదానంగా పెట్టుకున్నాడు. కళ్ళు పైకెత్తి నావంక జూసి "ఇదిగో, మంచి రసకందాయంలో వుంది. వచ్చేస్తాను వుండండి"అని మళ్ళా పూర్తిగా ప్రపంచాన్ని మరిచిపోయాడు. ★

"ఏరా గోపీ! ఇవ్వాళ సినిమా "దేవదాసు" కదూ!"

"'దేవదాసు' కాదురా పిచ్చిపుల్లయ్య."

"(కోపంతో) ఏమంటున్నావ్!..."

"(నవ్వుతూ) 'పిచ్చిపుల్లయ్య', అంటున్నాను."

—బి. ఆనందరావు, (జయపురం.)

* * *

తల్లి: ఒరేయ్ గోపీ! నీకు ఈసారి చెల్లాయి కావాలా, తమ్ముడు కావాలా?

గోపి: నాకు చెల్లాయి, తమ్ముడూ వున్నారుగా; సోమూలాగ నాకు అక్కయ్యగాని, అన్నయ్యగాని కావాలి.

—పి. హనుమంతరావు—రాజోలు.

## సింహసేనాపతి

(౩౫-వ పేజీ తరువాయి)

యింటిలోకి వచ్చివేశాడు. లోపల వడ్డన జోరుగా సాగుతోంది. సేనాపతి స్వయంగా భగవంతునికిఉత్తమ ఖాద్యాలను భోజ్యాలను వడ్డించి సంతర్పితుణ్ణి చేశాడు. భోజనం అయిన తర్వాత చేతులు కాళ్లు కడుగుకొని భగవానుడు ఆశీనుడైనాడు. తక్కిన భిక్షు సంఘం అంతా ఆయన చుట్టూ చేరింది. సింహసేనాపతికూడా వేరే ఆసనంమీద కూర్చున్నాడు. భగవానుడు ధార్మికకథా కథనంతో అందర్ని సంతర్పితులను చేశాడు.

8

ఆరామం చేరుకొనేదాకా శాక్యముని ఎవరితోను ఏమీ దారిలో మాట్లాడలేదు. ఆరామం చేరుకున్నతర్వాత ఆయన భిక్షు సంఘాన్ని సమావేశ పరిచారు. నిగంఠ జైనవృత్తాంతం ఆయన మనస్సులో ఆడుతూనేవుంది. మాంసాహారాల్ని గూర్చి వారు చేస్తున్న దుష్ప్రచారం భగవానుడికి కష్టం కల్గించింది. సమావేశమైన భిక్షు సంఘాన్ని తిలకించి ఆయన ఈలా అన్నాడు: మీరు ఆ యీ మాంసాలు ఇష్టం అనిచెప్పి వండించుకు తినకండి. శుద్ధ మత్స్యం యొక్క మాంసం తినడానికి మాత్రం ఆజ్ఞఇస్తున్నాను.

ఈ విధంగా సింహసేనాపతి దీక్ష బుద్ధుని ధర్మానికి ఒక క్రొత్త శాసనాన్ని సమకూర్చిపెట్టింది. ★

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## 175. భారతీయుల బోధనాపద్ధతులు

పురోగామి జాతులతో సంపర్కము లేకపోవుటవల్ల చక్కని బోధనాపద్ధతులు మనవారు వృద్ధిచేసుకోలేదు. తరగతులకు బోధించుట అన్నది మనవారికి అలవాటు లేదు. విద్య కొన్ని జాతుల హక్కు కాదా మరి? ఒక గురువుదగ్గర చేరడమూ ఆతడు చెప్పేదంతా-వ్యాఖ్యానాలతో పాటు వల్లె వేయడమూ, అతనిదగ్గర సరుకు అయిపోతే ఏదో గురుదక్షిణ ఇచ్చి వెళ్ళిపోవడమూ, ఇదీ శిష్యులపద్ధతి. చిన్న కుర్రవాడికి పాఠము చెప్పాలంటే గురువు చేసేదేమిటి? శబ్దమంజరీ, వ్యాకరణాలూ, కావ్యాలూ అన్నీ సంత చెప్పడమే. పుస్తకాల పద్ధతి లేకపోయె. మరి ఇతరులు ఇలాగ వ్యాఖ్యానించారని తెలుసుకోవడము ఎలాగా? భట్టీయం వెయ్యడమే.

సంగీతము పాఠము చెప్పే పద్ధతీ ఇదే. అన్నీ వల్లించడమూ సంప్రదాయము తప్పకుండా అప్పజెప్పడమూనూ. కంఠమాధుర్యము ఒక్కటే గాయకుడికి సహాయకారి. సంగీతము రాజసభలలో పాడకూడదు, రామసభలోనే పాడాలి. రాముడు పాట బాగుంటే తలఊపి, ఓగుంటే మూతి విరవడు కాదా? ఏదిపాడితే అదే సంగీతమూ! ఉత్తరభారతములో మహమ్మదీయుల సభలలో పాడవలసి ఉండడమువల్లనే అక్కడి గాయకులు ఒకర్ని మెప్పించడము కోసము పాడడము నేర్చారు. ఆ సంగీతములో రక్తి హెచ్చింది. దక్షిణాదివారు తాళపులెక్కలను ప్రదర్శించడమే గొప్పగా గుర్తించుకున్నారు.

చిత్రకళ అలవాటు చెసుకునే విద్యార్థులుకూడా గురువుగారు సంప్రదాయానుసారంగా రచించిన రేఖాచిత్రముమీద దిద్ది వ్రాయడమే అలవాటు చేశేవారు. అందువల్లనే ఒక చిత్రకారుడు - అజంతా, బాఘ్, సీతన్నవాసాల్, సిగిరియా, తంజావూరు, లేపాక్షి, రాజపుత్ర, కాంగ్రా సంప్రదాయాల్ని దేనిని చూచినా సరే - రచించే చిత్రాలలోని వ్యక్తులకందరికీ పోలిక కనబడుతుంది. భేదము సున్న అని కాదు; కొద్ది అని. నేడైనా ఒక చిత్రకారుడి రచనలను 'ఇవి' అని గుర్తుపట్టవచ్చును నిజమే. కాని రూపభేదము నాడు కన్న నేడు హెచ్చింది.

శిల్పములోకూడా ఒకే రకపు చెక్కడమే ఎక్కువ పూర్వులలో. క్రీ. శ. 150 నాటి బార్హత్ స్థూపపు రాతికంచెయొక్క అడ్డ కంబాలమీద చెక్కిన బొమ్మలన్నీ ఒకే మోస్తరు. జడనిబట్టి వక్షాల్ని గుర్తించీ స్త్రీమూర్తులని చెప్పాలిగాని ముఖముచూసి చెప్పలేము. నాగార్జునకొండ, గోలీ, శిల్పాల్ని చూడండి. రాజూ, బంట్లూ అందరూ ఒకటే రూపు. తరువాతి శిల్పులు సమకాలిక రాజుల బొమ్మలు చెక్కినా ఏవో తమకి వచ్చినట్లు చెక్కి 'కృష్ణదేవ రాయరు' 'తిరుమల దేవియరు' 'చిన్నాదేవియరు' అని పేర్లు పెట్టేశారుగాని ఆ బొమ్మలకి ఆబొమ్మలు సూచించే వ్యక్తులకి పోలిక సాధించే యత్నము చేయలేదు. శిల్పము నేర్చుకునే విద్యార్థులు ఇంకొక బొమ్మనిచూచి చెక్కడము నేర్చుకునేవారు కాబోలు.

చిత్రములు రాస్తూన్నప్పుడు ఏదో ఒక కొసని ప్రారంభించి రాయడమేకాని దిద్దుబాట్లకోసము మన చిత్రకారులు ఒకసారి రాసినది చెరిపినట్లు కనబడదు. సింహళములోని సిగిరియా చిత్రాలలో ఒకస్త్రీ చేతిని ముందు ఒకలాగు (వద్దని సంజ్ఞచేస్తూన్నట్లు) రాసి మళ్ళీ (తే అన్నట్టుగా రాసి) దిద్దుకున్నాడు చిత్రకారుడు. పాత హస్తముద్రని చెరిపేయలేదు. చెరిపివేయడము సంప్రదాయముకాకనో, వీలు లేకనో? ఏమనుకున్నా చెరపడమన్నది మనవారి చిత్రకళలో లేదనే తేల్తుంది. తోక చివర్ని ప్రారంభించి ఒంటిగీతతో గంధర్వుల గుఱ్ఱమును రాసిన దేశి చిత్రకారుణ్ణి నేను చూచాను. బాలి ద్వీపపు తాళపత్ర లేఖనాలు ఎన్నో ఉన్నాయిట ఐరోపామ్యూజియములలో. గంటముతో రచించిన చిత్రము దిద్దడమెలాగా? ఈ చిత్రకారులు గురువులు రాసిన చిత్రములను - మన పిల్లలు అక్షు

# విజ్ఞాన వీధులు

రాళ్ళి దిద్దినట్లుగా - దిద్ది నేర్చుకుని ఉంటారు.

దేవాలయాల నిర్మాణమూ, గోపురనిర్మాణమూ గమనిస్తే ఒక పెద్ద దేవాలయమున్న చుట్టుపట్ల బయల్దేరిన చిన్న దేవాలయాలన్నీ ఆ పెద్దదేవాలయపు నమోనానిపట్టి కట్టినట్లు గోచరిస్తాయి.

తరగతులకు కాక వ్యక్తులకు బోధపరచవలసివచ్చినప్పుడు అనుకరించమనడమే బోధనాపద్ధతి అవుతుంది. కాని పలువురికి బోధపరచవలసివస్తే 'పద్ధతులు' కావలసివస్తాయి. నేటి విద్యావిధానములో పద్ధతులదే ప్రాముఖ్యత.



## చిట్టిప్రశ్నలకు జవాబులు

—చలికి వాడే దుస్తులు చలికాలమంతా శరీరంమీద ఉండాలి. తెల్లగా తయారుచేస్తే త్వరగా మాపు తెలిసిపోదా? అవి కొనడానికీ ప్రియమే, బాగుచేయించడానికీ ప్రియమే! కనక గాఢమైన రంగులవే మనము కొంటాము. అందుకని వారు అలాంటివి తయారుచేస్తారంటాను జగన్నాధరావుగారూ.

—గొడుగు గుడ్డ సూర్యుని వేడిమినీ (వెల్తురునీ) మనకి తగలకుండా చెయ్యడానికికదా? కనుక అన్ని రంగుల కిరణాల్నీ పీల్చుకునే నల్లరంగు వాడతారు గొడుగు గుడ్డకి. ఇంకే రంగు వాడినా దాని కాంతికి కళ్ళు జిగ్గుమంటాయి.

—సూర్యతేజమున ప్రాణులకు కావలసిన అందునూ ముఖ్యముగా మొక్కలకు కావలసిన శక్తి ఉన్నది. ఆ శక్తికి వస్తుయోగ్యతనుబట్టి ప్రవర్తించు గుణము లేదు. వస్తువులకే ఆ శక్తిని వివిధరీతుల ఉపయోగించుకోగల యోగ్యతలున్నాయి.

—మత్స్యావతారానికి గుడి మే మెరుగము: ఎక్కడో ఉండవచ్చును. కూర్మావతారానికి శ్రీకూర్మములోనూ, వరాహావతారానికి సింహాచలములోనూ, నారసింహునికి చాలచోట్ల, రాముడికి భద్రాద్రి, ఏకాంత రామేశ్వరమూ, తిరువళ్ళూరూ; కృష్ణుడికి సరే; (పరశురాముడికి లేదు. చివర రాముడికి శక్తి గోల్పోయినాడు గదా?)బుద్ధుడికి జగన్నాధములో కాబోలు. కలి ఇంకా రావాలి. వామనుడికి గుడి మే మెరుగము.

—"తుమ్ములూ, బల్లిపాటూ, శకునాలూ, ఇవన్నీ సహజంగా జరిగేవే. వాటివల్ల యే లాభనష్టాలు ఉండవన్న" మీతో ఏకీభవిస్తాము మారుతి రామిరెడ్డిగారూ.

—రిపశుద్ధమైన నీరు ఎన్నాళ్ళు ఉంచినా అందులో క్రిము లుద్భవించవు. మేము వాననీటిని రెండునెలలు మూతవేసి ఉంచినా పురుగు పట్టనేలేదు.

—పంపులగొట్టములు భూమిలో పైపైనే ఉంటాయి. కనక భూమిదల్లదనము ఆగొట్టాలకిపట్టి, ఆ గొట్టాలలోనుంచి వచ్చే నీరు చల్లగా వుంటుంది. బావులలో నీరు పంపుగొట్టాలకన్న చాలా లోతుగా వుంటుంది. కనక చలి అందక శీతకాలంలో వెచ్చగా వుంటుంది. నీరు వేడిమికి వాహకము కాదు. కనక ఉపరితలానికి అందిన చలి లోతుకి అందదు. ఇదికూడా కారణమే చలికాలంలో బావినీరు వెచ్చగా ఉండడానికి.

—అవును. కొత్త నక్షత్రములు ఆకాశాంతరాళములో దీప్తి సంయోగమువల్ల ఏర్పడువనే నమ్మకము కొందరు శాస్త్రజ్ఞులకున్నది. అమెరికాదేశపు మిల్లికను వారిలో ప్రముఖుడు.

—పడిశముపట్టుటకు కారణము సూక్ష్మజీవులకంటె సూక్ష్మమైన 'వైరసు' వైరసులో నేటికి నిర్మించబడిన సూక్ష్మదర్శినిలవల్ల చూడడానికి ఏమీ దొరకడములేదు. ఈ వైరసులలో వేర్వేరు వ్యాధుల్ని తెచ్చే రకాలున్నాయి.

—నత్తికి కారణము మాట్లాడాలన్న అతి తొందరయే కాని నాలుక లోపము కాదట. నత్తికలవారు అన్ని మాటలూ నత్తి పలకరూ, అన్ని వేళలా నత్తి పలకరూ. కంగారు పడకుండా శాంతంగా మాట్లాడడము నేర్చుకుంటే నత్తి పోతుందట.

—వందలకోట్ల సంవత్సరాల క్రితము జరిగిన సంఘనలను వాటి ఫలితాలు నేటివరకూ నిల్చిఉండడాన్నిబట్టి తెలుసుకుంటున్నాము. భవిష్యత్తును ఈనాటి స్థితినిబట్టీ, జీవపరిణామ, భౌతిక పరిణామ సూత్రాన్నిబట్టీ ఇలాగ జరగవచ్చునని ఊహిస్తారు శాస్త్రజ్ఞులు.

—హిప్నాటిజము కనబడుతూంటేనే? నమ్మకముపోతే లోటు ఎవరికీ? హిప్నాటిజములో జరిగే పరిస్థితులు ఇంకా తెలియవు.

—మానవులకూ పక్షులకూ కలిపి ఎగురగల మానవులను సృష్టించడమా? సాధ్యమని తోచదు. పెద్దపులీ సింహాల్నీ, పిల్లీ కుక్కల్నీ కలిపితే పుట్టిన పిల్లలు అచిరకాలములో చచ్చిపోయాయి. ఇతర 'మిశ్రమా'లు చచ్చిపుట్టినవీ కలవు. చెట్లలో చేసిన మిశ్రమాలు పిందెల్ని పెట్టక మాడిపోయాయి. ఆర్కిడిస్ జాతి మొక్కలలో స్వపరాగసంపర్కము జరిగితే పువ్వులు మాడిపోతాయి.



 ఉద్యోగం 

(27-వ పేజీ తరువాయి)

ప్రచారం జరిగింది. అటువంటివి నాకు కిట్టవు" అన్నాడు శర్మ.

తర్వాత తను అప్లికేషనుఫీజు నిమిత్తమై కృష్ణారావుదగ్గర అప్పుచేసినట్లు చెప్పి ఐ. ఏ. యస్. వార్తను యెవరితోనూ చెప్ప వద్దన్నాడు. తండ్రి 'సరే' అన్నాడు.

ఆనాడు సాయంత్రం తండ్రి శర్మకు రెండువందల రూపాయలు ఇచ్చి కృష్ణారావు బాకీ తీర్చివేసి మిగిలిన డబ్బుపెట్టి ఖరీదైన సూటు కుట్టించుకోమన్నాడు. ఈ సలహాను కృష్ణారావు అనేకసార్లిచ్చేడు. శర్మ ప్రక్కనవున్న బస్తీకి వెళ్ళి ట్వీడ్ సూటు కొకదానికి ఆర్డరిచ్చేడు. మంచి రంగులుగల నెక్టయి, బూట్లు సాక్సుకూడా కొని తెచ్చుకున్నాడు. ఇంటికి రాగానే తండ్రి 'అవి చాలా బాగున్నాయి' అన్నాడు.

తండ్రి కొడుకుల ప్రవర్తన ఇంటిలో వారికి కొంత ఆశ్చర్యం కలిగించింది. శర్మకేదేనా పెద్ద వుద్యోగం వచ్చిందేమో అనుకున్నారు. రాలేదని శర్మ చెప్పేడు.

అయితే ఈ ఖర్చులు, ఈ వేషాలు యేమిటీ?" అని అడిగింది రాజ్యం.

"ఉద్యోగప్రయత్నాలు" అన్నాడు శర్మ.

ఇంటర్వ్యూకి వెళ్ళవలసిన సమయం వచ్చింది. ఇంటర్ క్లాసులో ప్రయాణం చేయమనీ, అన్ని వసతులూగల పెద్ద హొటలులోమాత్రమే మకాం చేయవలసిందని తండ్రి సలహా యిచ్చేడు. "సరే" నన్నాడు శర్మ. మిగతావారు శర్మ ఉద్యోగంకోసం గట్టిప్రయత్నాలు చేస్తున్నాడనుకున్నారు.

ఇంటర్వ్యూకి లెక్కల లెక్చరర్ రాలేదని శర్మకు తెలిసింది. వెనకటి అనుభవాన్ని పురస్కరించుకొని ఈసారి సమాధానాలు యేమి తొణకకుండా చెప్పేడు. మొత్తం మీద ఇంటర్వ్యూని జయప్రదంగా ముగించుకుని యింటికి చేరేడు.

ఒకరోజున ట్వీడ్ సూట్ నెక్టయి మొదలైనవి ధరించి తన గదిలో కూర్చున్నాడు. రాజ్యంచూసి "ఈ వేషంలో మీరొక జిల్లా కలక్టరులాగ వున్నారు" అంది.

"అట్లాగయితే ఎప్పుడూ ఈవేషంలోనే వుండదల్చుకున్నాను" అన్నాడు శర్మ.

ఐ. ఏ. యస్ లో శర్మకు మూడవ ర్యాంక్ వచ్చింది. ఈ వార్త ఒక అర గంటలో వూరంతా వ్యాపించి పోయింది. "శర్మ చాలా తెలివైనవాడని మాకు మొదటి నుంచీ తెలుసు, ప్రతీక్లాసులోనూ ఫస్టుగా వుండేవాడు" అన్నారు. "అతను అమాయకుడు" అన్నవాళ్ళు "అతను చాల బుద్ధిమంతు"డన్నారు. మొత్తంమీద శర్మలో ఏవేనా చిన్నచిన్న లోపాలుంటే అవన్నీ సద్గుణాలుగా మారిపోయేయి.

శర్మ తండ్రి ఉత్సాహానికి హద్దు లేదు. శర్మతల్లి "నేను చెప్పలేదూ, మనవాడికి పెద్ద ఉద్యోగం వస్తుందనీ" అంది.

"ఏదో పైకి అట్లాగ అన్నాను కానీ నాకు మాత్రం తెలియదా యేమిటి?" అన్నాడు తండ్రి.

"అయినా మీ డబ్బు వాడికి అచ్చి రాలేదు. పరీక్షకి వెళ్ళటానికి రాజ్యందగ్గర నాదగ్గరా కలిపి యాభైరూపాయలు వుంటే యిచ్చి పంపించేం" అంది తల్లి.

ఏమి అన్నా తండ్రికి సంతోషంగానే వుంది.

అందరూ తలోసారీ కరణంగారియింటికి వెళ్ళి వచ్చేరు. అయితే కరణంగారియింట్లో యెవరినీ చూడటానికి వీల్లేకపోయింది.

ఎటువంటి వార్తలూ లోనికి ప్రవేశించటానికి వీల్లేదు అన్నట్టుగా వారి వాకిలి తలుపులు ఆరోజంతా బంధింపబడి వున్నాయి.

కృష్ణారావు హొటల్ లో కాఫీ సేవిస్తూ ఐ. ఏ. యస్ ఫలితాలు చూసేడు. శర్మ పేరు మూడవ ర్యాంకులో కనబడగానే త్రాగుతూవున్న కాఫీని వదిలేసి ఊళ్ళో వున్న రాఘవరావు యింటికి పరుగెత్తుకుని వెళ్ళేడు. రాఘవరావు ఆఫీసుకు వెళ్ళినట్టు ఇంట్లోంచి యెవరో చెప్పేరు. కృష్ణారావు ఆఫీసుకు వెళ్ళేడు. రాఘవరావు కుర్చీలో కూర్చుని ఫైళ్లు తిరగేస్తున్నాడు. ఈవార్తని చెప్పేడు. రాఘవరావు ఈ వార్తని యింతకు ముందే పేపర్లో చూసేడు.

"శర్మకు ఐ. ఏ. యస్ లో సెలక్షను వచ్చింది" అన్నాడు కృష్ణారావు.

"ఏ శర్మ?"

"ఏ శర్మో అయితే నాకెందుకూ? మన శర్మ"

"వాడెప్పుడూ ఐ. ఏ. యస్ పరీక్షకు వెడుతున్నట్టు నాతో చెప్పలేదే?"

"నువ్వు పబ్లిక్ సర్వీసు కమీషనుకు వెళ్ళినప్పుడు శర్మతో చెప్పేవు గనకనా? వాడెందుకు చెప్పాలి?"

"అప్పుడు నేను చెప్పక పోవడమే అతనికి లాభం. లేకపోతే నాలాగే గుమాస్తాగా తయారయ్యేవాడు.

"వాడు నీకు చెప్పక పోవటం కూడా నీకు లాభమే. రెండువందల రూపాయలు నీకు మిగిలేయి."

తాసిల్దారు వచ్చేడు. అందరు గుమాస్తాలలాగే రాఘవరావుకూడా లేచినించున్నాడు. రాఘవరావు అతికష్టం మీద నవ్వు తెచ్చుకుని తన ప్రియమిత్రుడొకడు ఐ. ఏ. యస్ మూడవ ర్యాంకులో ప్యాసైయ్యేడని చెప్పేడు. ఆఫీసరు నవ్వి "అయితే బాగానే వుంది. మీ మిత్రుడు యెప్పుడో మనకు పై అధికారిగా వస్తాడన్నమాట!" అన్నాడు.

"ఇక్కడికే రావాలనేముందిలెండి. దేశం మొత్తంమీద యే రాష్ట్రంలో నైనా వేయవచ్చు" అన్నాడు రాఘవరావు.

"మొదటి పది ర్యాంకుల్లో వచ్చినవారిని వారు కోరుకున్న రాష్ట్రాల్లోనే వేస్తారు" అన్నాడు ఆఫీసరు.

రాఘవరావు గుండెల్లో రాయిపడింది. భూకంపంవచ్చి సీటు కదిలిపోతుందా అనిపించింది. ప్రక్కనున్న కృష్ణారావునిచూసి "ఉద్యోగాలు సుడిగుండాలు ఒకసారి ఒకరిది పైచేయీ మరొకసారి యింకొకరిది పై చేయీ అవుతుంది" అన్నాడు రాఘవరావు.

"అంతేకాని మన విద్యార్థి జీవితంలోని మన ప్రవర్తనకు ఇదొక ప్రత్యక్షమైన శిక్ష అని గ్రహించలేకపోయేవన్న మాట!" అన్నాడు కృష్ణారావు.

"భేష్" అన్నాడు ఆఫీసరు. రాఘవరావు తప్ప అందరూ నవ్వేరు.

సమాప్తం.

## గ్రంథ ప్రకాశం

### అక్కడక్కడ

ఖండకావ్యము; రచయిత సేనాపతి రామాచార్య; పరిష్కర్త వానమామలై లక్ష్మణాచార్య కవి; వెల 1-0-0; సుహృదులకు ప్రత్యేకమైన వెల 2-0-0; ముద్రణ శ్రీరామా పవర్ ప్రెస్ 1877-79 సాండర్స్ రోడ్, సికిందరాబాదు (ద).

### సమీర కుమార సందేశము

పద్యకావ్యం; శ్రీ నారాయణ పండితాచార్యుల వారి "సంగ్రహ రామాయణ" మందలి సుందరకాండమునకు బక్షీ వాసుదేవరావుగారి ఆంధ్రీకరణము. వెల 1-8-0. ప్రతులకు బి. వాసుదేవరావు; ఛత్రపూర్ (గంజాంజిల్లా).

### ఇంజక్షను విధానము

గ్రంథకర్త: వైద్యవిద్వాన్ దూబగుంట సుబ్రహ్మణ్యం; వెల 1-8-0; ప్రతులకు ఇండియన్ మెడిసిన్ హౌస్, బకింగ్ హాంపేట, విజయవాడ. ఆయుర్వేద పద్ధతికి సంబంధించిన ఇంజక్షనులను ఇచ్చే విధానము ఆయుర్వేద వైద్యులకు ఉపయుక్తంగా ఉండేటట్లు వివరింపబడింది.



నేషనల్ ఆర్ట్ థియేటర్ వారి "తోడు దొంగలు"లో ఎన్. టి. రామారావు.

వాహినీవారి "పెద్దమనుషులు"లో నలుగురు పెద్దమనుషులు గౌరీనాథశాస్త్రి, వంగర, ఏ. వి. సుబ్బారావు, కుటుంబరావు.



వాహినీవారి "పెద్దమనుషులు"లో రేలంగి, అసలు పెద్దమనిషి లింగమూర్తి.



# ★ యూరప్, అమెరికాలలో సినిమా పరిశ్రమ ★

జెమినీ సంస్థకు చెందిన ఎమ్. ఎ. పార్థసారథిగారు గత సంవత్సరం జూన్‌లో యూరప్, అమెరికాల పర్యటనకు బయలుదేరి ఎనిమిదిమాసాలు పర్యటించి ఇటీవలే తిరిగివచ్చారు. భారతీయ చలనచిత్రాలను విదేశాలకు ఎగుమతి చేయడంలోను, ప్రదర్శించడంలోను గల సాధకబాధకాలను పరిశీలించే నిమిత్తం జెమినీ అధినేత ఎస్. ఎస్. వాసన్‌గారి తరఫున పార్థసారథిగారు వెళ్లారు.

ఫిబ్రవరి 28 వ తేదీ సాయంత్రం దక్షిణ భారత సినీ టెక్నిషియన్ల సంఘంవారి సమావేశంలో పార్థసారథిగారు తమ పర్యటనానుభవాలను వివరించారు. భారతదేశం పట్ల విదేశాలలో ఇప్పు డున్నంత శ్రద్ధ, ఆసక్తి మరెప్పుడూ లేవని, భారతీయ చలనచిత్రాలను చూడాలనే ఆసక్తికూడా ఎక్కువగా ఉందని, ఈ ఆసక్తిని ఉపయోగించుకొని భారతీయ నిర్మాతలు విదేశాలతో లాభసాటి వ్యాపారం చేయవచ్చునని ఆయన సూచించారు.

“నేను 8 నెలలపాటు విదేశాలలో సంచరించాను. నిర్మాతలను, డిస్ట్రిబ్యూటర్లను, ఎగ్జిబిటర్లను కలుసుకున్నాను. యూరప్, మధ్య ఆసియాలలో 15 దేశాల్లోను, అమెరికాలోను తిరిగాను. బెర్లిన్, వెనీస్ నగరాల్లో జరిగిన అంతర్జాతీయ చలనచిత్రోత్సవాలకు హాజరయ్యాను. ఎక్కడ చూసినా, ఎవరితో మాట్లాడినా భారతదేశంమీద గౌరవం వెల్లడి అయింది. కాని వారికి భారతీయ సినిమా పరిశ్రమనుగూర్చి ఏమీ తెలియదనే విషయంకూడా గమనించాను: ప్రపంచ చలనచిత్రోత్సవాలలో పాల్గొనడానికి భారతీయులు ఇష్టపడడం లేదని ఎలా కలిగిందో వారికి ఒక అపోహ కలిగింది. ఒకవేళ ఇష్టపడినా ఆహ్వానాలు ఎవరికి పంపించాలోకూడా వారికి తెలియదట.

భారతదేశపు ప్రతిష్ఠ ఇతరదేశాలలో ఇనుమడించడానికి పండిట్ నెహ్రూ, ఆయన విదేశాంగ రాజనీతి ముఖ్య కారణం. ఐక్యరాజ్యసమితిలో విజయలక్ష్మీ పండిట్ వహిస్తున్న పాత్ర, అంతకంటే ఎక్కువగా కొరియాలో జనరల్ తిమ్మయ్య నెరవేర్చిన పని మన దేశంపట్ల గౌరవం పెంపొందించాయి. రాజకీయంగా మనపట్ల ఇంత ప్రాముఖ్యం ఉన్నప్పటికీ, దీన్ని చలనచిత్రరంగంలో మన నిర్మాతలు ఏమీ ఉపయోగించుకోలేకపోయారు.

మూడేళ్లకిందట ఒకసారి నేను యూరప్ వెళ్లాను. అప్పటికి యూరపియన్ సినిమా పరిశ్రమ రెండో ప్రపంచయుద్ధపు దెబ్బ నుండి ఇంకా బాగా కోలుకోలేదు. జర్మనీలో సినిమా పరిశ్రమ బాగా దుస్థితిలో పడింది. ఇటలీలో విజాతీయమైన సరుకు ఎక్కువగా తయారయేది. ఫ్రాన్సులో ఏ రకం చిత్రాలు నిర్మించడమా అనే సందిగ్ధత ఎక్కువగా ఉండేది. కాని ఇప్పుడు పరిస్థితి బాగా మారిపోయింది. ఆ దేశాల్లో సినిమా పరిశ్రమ బాగా కోలుకుంది. ముఖ్యంగా ఇటలీదేశంలో సినిమా నిర్మాణం చాలా మార్పు చెందింది. నవవాస్తవికత (నియోరియలిజం) అనే మాత్రం తలఎత్తింది. వాస్తవపరిస్థితులను సాధ్యమైనంత సత్య సన్నిహితంగా చిత్రించాలనే ఆకాంక్ష ప్రబలింది. ‘బైసికిల్ థీఫ్’ లాంటి చిత్రాలు స్వదేశంలోనే కాకుండా విదేశాల్లోకూడా గౌరవం, ధనలాభం పొందాయి. కథావస్తువులను ఎన్నుకోవడంలోను, చిత్రణలోను ఇటాలియన్లను అనుకరించాలనే ధోరణి దాదాపు అన్ని దేశాల్లోను ఎక్కువౌతోంది. ఇంగ్లండులో కూడా వాస్తవిక చిత్రాల మీదికి మోజు తిరిగింది. అయితే ఇంగ్లండు చాలా చిన్న దేశం. జనసమ్మర్దం ఎక్కువ. ఇటలీలో మాదిరిగా కాక, విశాలమైన బయళ్ళు, సూర్యకాంతి తక్కువ. అందుచేత ఇటలీలో మాదిరి ఔట్‌డోర్ లొకేషన్స్‌కి వెళ్ళకుండా స్టూడియోలలోనే కృత్రిమ వాతావరణం కల్పించుకొని చిత్రాలు తీస్తున్నారు.

స్కాండినేవియన్ దేశాల్లో కూడా సినిమాపరిశ్రమ కోలుకుంది. అయితే నార్వే, స్వీడన్‌ల మార్కెట్ చిన్నది. అందుచేత తమ ప్రజలు ఎటువంటి చిత్రాలు చూడగోరుతారో అటువంటి చిత్రాలే తయారు చెయ్యాలని వారి సిద్ధాంతం. నార్వేలో ప్రభుత్వంవారి సెన్సార్‌షిప్ భిన్నంగా వుంటుంది. రాజకీయంగా దేశవ్యతిరేకమైన విషయాలు కనిపిస్తే సెన్సార్ చేస్తారుగాని మిగతా విషయాల్లో ప్రభుత్వంవారు జోక్యం కల్పించుకోరు. నైతికమైన అభ్యంతరాలుంటే పరిష్కరించడానికి ప్రతి పట్టణంలోను ‘కమ్యూనిటీ ఫిల్మ్ సెంటర్లు’ ఉంటాయి. కమ్యూనిటీ అంటే ఒక పేటలాంటిది. ఆ పేటలోని డిస్ట్రిబ్యూటరు, ఎగ్జిబిటరు, ఒక ప్రజా ప్రతినిధి కూర్చుని ఆ పేటలో జనులు చూడరానిదని తమకు తోచినదేదైనా వుంటే తొలగిస్తారు. ఈ సెన్సార్‌షిప్ ఆ పేటకు మాత్రమే వర్తిస్తుంది. ఇంకొక పేటలో వేరే సంఘంవారు సెన్సార్ జరుపుతారు.

నార్వేలోను, స్వీడన్‌లోను, నిర్మాతలు కథమీదకంటె ఫొటోగ్రఫీమీద ఎక్కువ శ్రద్ధ చూపుతున్నారు. వారికున్న టెక్నికల్ సాధన సామగ్రి చూస్తే కళ్లు తిరిగిపోతాయి.

ఫ్రాన్సులో ప్రభుత్వం సినిమాపరిశ్రమకు చాలవిధాలుగా సహాయం చేస్తోంది. ఫ్రాన్సులో ఏడాదికి 25 ఫిల్ములుమాత్రమే తయారవుతాయి. అమెరికన్ ఫిల్ములు 250, బ్రిటిష్ ఫిల్ములు 10, ఇటాలియన్ ఫిల్ములు 10 దిగుమతి అవుతాయి. ఈ కారణంవల్ల దేశీయపరిశ్రమకు నష్టం వాటిల్లకుండా పన్నులు విధించేవిధానం ఫ్రెంచివారికి అనుకూలంగా ఉండేటు ప్రభుత్వం చేస్తూవుంటుంది. విదేశీయఫిల్ములపై ఎక్కువ పన్నులు, స్వదేశీయఫిల్ములపై తక్కువ పన్నులు వేసి ఆవిధంగా కొంత ‘ప్రొటెక్షన్’ కలిగిస్తుంది.

## అమెరికా

అమెరికాలో ఈరోజున ‘నంబర్ వన్ ఎంటర్‌టెయినర్’ అని పేర్కొనవలసివస్తే చలనచిత్రాన్ని కాదు; టెలివిజన్‌నే పేర్కొనాలి. మూడేళ్లకిందట పరిస్థితికీ ఇప్పటి పరిస్థితికీ పోలికే లేదు. ఇప్పుడు టెలివిజన్ ప్రజావినోదపు మార్కెట్‌ను చాలవరకు స్వాధీనపరుచుకుంది. 15 కోట్ల 60 లక్షల జనాభాకి 5 కోట్ల టెలివిజన్‌సెట్లున్నాయి. దాదాపు ముగ్గురు మనుషులకి ఒక సెట్టు ఉందన్నమాట. అందమైన టెలివిజన్ సెట్‌ను మన ఇంట్లోనే అమర్చుకొని మన కిష్టంవచ్చిన ప్రోగ్రాము చూసి ఆనందించవచ్చును. ఒకసెట్టుకు 9 మీటలుంటాయి. ఏ కుర్రాడైనా ఈ మీటలు నొక్కి తనకి కావలసిన ప్రోగ్రాము పెట్టుకోవచ్చు. అమెరికాలో టెలివిజన్ కంపెనీలు ఆరున్నాయి. కార్యక్రమాలను ప్రసారంచేసే స్టేషన్లు ఏడాదికిందట 140 వున్నాయి. ఇప్పుడు 500 ఉన్నాయి. ఈ సంవత్సరాంతానికి ఈ స్టేషన్ల సంఖ్య 750 అవుతుందట. ఈ స్టేషన్లు రాత్రింబగళ్ళు ఎడతెరిపి లేకుండా ఏదో వొక ప్రోగ్రాము ప్రసారం చేస్తూనే వుంటాయి. వార్తలు, ఆటలు, ఫిల్ములు, నాటకాలు, చిత్ర



ప్రకాశ్ ప్రొడక్షన్సువారు తీస్తున్న పిల్లల చిత్రాలు మూడింటిని ఇటీవల ఆంధ్ర ఆర్థికమంత్రి తెన్నేటి విశ్వనాథంగారికి నిర్మాత ప్రకాశరావుగారు తమ స్టూడియోలో చూపించినప్పటి ఫొటో.



మద్రాసుకు గతమాసంలో వచ్చిన సోవియెట్ ప్రతినిధులకు హోటల్ ఓషియానిక్‌లో ఫిబ్రవరి 17-న సన్మానంజరిగింది. సోవియెట్ స్త్రీలందరూ చీరెలు కట్టుకుని వేదికపై నిలబడ్డారు.





సోవియెట్ సాంస్కృతికమండలి సభ్యులు గత మాసం మద్రాసు వచ్చినప్పుడు వర్తకి శ్రీమతి తారాచౌదరి ఆహ్వానంపై 'ఇండియన్ డాన్స్ సెంటర్' దర్శించారు. భారతీయ నాట్య పద్ధతులను శ్రీమతి చౌదరి అతిథులకు వివరించారు. బాలెరినా ప్లిసెట్స్కాయాకు శ్రీమతి చౌదరి భరతనాట్యపు దుస్తులను, గ్రామొఫోను రికార్డులను బహూకరించగా, ఆమె తన బాలే కాలిజోళ్లను బహూకరించింది. ఫొటోలో ఉన్నవారు తారాచౌదరి, ప్లిసెట్స్కాయా.

# యూరప్, అమెరికాలలో సినిమాపరిశ్రమ

ప్రశ్నలు - ఇలాగ ఎన్నో రకరకాల అంశాలతో కూడిన కార్యక్రమాలుంటాయి. మన కేదికావలిస్తే అదే చూడవచ్చు. స్కూలుపిల్లల విద్యాభ్యాసంకూడా టెలివిజన్ ద్వారా జరగవచ్చు. బాబ్ హోప్, బింగ్ క్రాస్బీ మొదలైన ప్రసిద్ధ హాలీవుడ్ తారలు టెలివిజన్ కార్యక్రమాల్లో పాల్గొంటూ వుంటారు. ఈ తారలు సినిమా తెరమీద

వలె కాక, ప్రేక్షకులు తెరమీద చూసే క్షణంలోనే టెలివిజన్ స్టేషన్‌లో ఉండి నటిస్తూంటారు కనుక, ప్రేక్షకులు తారలు తమ ఎదుటే ప్రత్యక్షమైనంత ఆనందం పొందుతారు. ఈ కారణాలవల్ల టెలివిజన్ అమెరికాలో చాలా ప్రజాదరం పొందింది.

సినిమా పరిశ్రమ టెలివిజన్‌తో పోటీ చేయలేకుండా వుంది. సినిమాలు ఇంత వరకూ గుత్తకు పుచ్చుకొన్న 'కలర్' కూడా టెలివిజన్‌లోకి వస్తోంది. టెలివిజన్ కంపె నీలు ఇటాలియన్, ఫ్రెంచి ఫిల్ములను కూడా ఇంగ్లీషులోకి డబ్ చేసి టెలివిజన్ తెరమీద ప్రదర్శిస్తున్నాయి. డబ్బింగ్‌లో శబ్దంయొక్క సింక్రొనైజేషన్‌లో ఏ లోపా లున్నప్పటికీ టెలివిజన్ తెర చిన్నది కనుక అవేవీ కనిపించవు. ఈ విషయంలో సిని మాలు టెలివిజన్‌తో పోటీ చెయ్యలేకుండా ఉన్నాయి. అమెరికాలో ఉన్న 2000 సినిమా థియేటర్లలో ఇప్పటికి 6000 థియే టర్లు పూర్తిగా మూసివేయబడ్డాయి. హాలీవుడ్ సినిమానిర్మాణం నూటికి 40 వం తులు తగ్గిపోయింది.

ఈ ప్రమాదంనుండి బయటపడే వార్గం త్రీ - డీ ఒక్కటే అని నిర్మాతలు నిశ్చ యించుకున్నారు. త్రీ డైమన్షనల్ టెక్నిక్‌లో చాలరకా లున్నాయి: సిని రమా, సినిమాస్కోప్, వైడ్‌స్క్రీన్, త్రీ - డీ మొదలైనవి. వీటిలో నిజమైన వాస్తవిక విభ్రాంతి కలగజేసేది సినిరమా ఒక్కటే. బ్రహ్మాండమైన తెర, 8 లౌడ్ స్పీకర్లు, 8 సౌండు ట్రాకులు ఉపయో గించడంవల్ల స్టీరియోఫోనిక్ శబ్దం సినిరమా సాధించింది. నేను సినిరమా ప్రదర్శనం చూశాను. ప్రతిబింబం మూడుకోణాల్లో కనిపించడమేకాక ఆ ప్రతిబింబం మనలను అన్నివైపులా ఆక్రమించుకునివున్నట్లు భ్రాంతికలిగి, చిత్రంలో అక్షరాలా మనం మునిగిపోతాము. సినిరమాలో జలపాతం దృశ్యం చూసినప్పుడు, నీళ్ళు నా కుర్చీ కిందకి ప్రవహిస్తున్న భ్రాంతి కలిగి నేను వద్దనుకుంటూనే కాళ్లు కొద్దిగా ఎత్తుకో వలసి వచ్చింది.

# త్వరలో కొత్త సీరియల్

# "మంచి - చెడూ"

## రచన: శ్రీ "శారద"

ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక పాఠకులకు త్వరలోనే ఒక కొత్త సీరియల్ నవలను అందించగలుగుతున్నందుకు ఆనందిస్తున్నాము.

ఆర్థిక స్తోమతు లోపమైనప్పుడు సమాజంలో జీవనం ఎంత యాతనామయమౌతుందో ముఖ్యంగా స్త్రీలకు అట్టి పరిస్థితులలో ఎంతటి ఘోరపతనం సంభవిస్తుందో ఈ చిన్న నవల యథాతథంగా చిత్రిస్తుంది. అయితే అమానుషమైన ఈ దుఃఖాంధకారంలో సహజ మానవ సౌశీల్యం, ప్రేమార్ద్రితలు వెలుగుదారులు చూపగలవు. నేటి సామాజిక జీవనాన్ని వాస్తవికంగా చిత్రించడానికి రచయిత శ్రీ 'శారద'గారు చేసిన కృషి పాఠకులలో ఔత్సుక్యం రేకెత్తించగలదని ఆశిస్తున్నాము - సంపాదకుడు.

అయితే సినిరమానిర్మాణం చాలా సాధక బాధకాలతో కూడింది కనుక దానికి అట్టే భవిష్యత్తు ఉన్నట్టు నాకు తోచదు. భవిష్యత్తు ప్రకాశమానంగా ఉన్నది సినిమా స్కోప్ టెక్నిక్కు మాత్రమే. ఇందులో త్రీడైమన్షనల్ భ్రాంతి సంపూర్ణంగా ఉండకపోయినా స్టీరియోఫోనిక్ శబ్దం నిర్దుష్టంగా వుంటుంది. అంటే శబ్దం ఎక్కడ నుంచి వస్తున్నట్టు తెరమీద కనిపిస్తుందో, నిజంగా అక్కడనుంచే వినిపిస్తుంది కూడాను.

అమెరికన్లకు కొత్తవస్తువుల మీద మోజెక్కువ. వారు నిత్యనవ్యతాన్వేషులు. కొత్తవస్తువు కనిపిస్తే చాలు, పాతవస్తువు మంచిదైనా సరే పారేసి, కొత్తవస్తువు చెడ్డదైనా సరే దాన్నే గ్రహిస్తారు. ఇందువల్లనే అమెరికన్ పారిశ్రామిక రంగంలో రోజుకొక కొత్తవిప్లవం, కొత్తపరిణామం కలుగుతూంటుంది.



ఇంతకాలమూ వారు బ్రిటిష్ చిత్రాలను ఎగతాళిచేసేవారు. ఇప్పుడు బ్రిటిష్ చిత్రాలకు, తదితర యూరపియన్ చిత్రాలకు, జాపనీస్ చిత్రాలకు అమెరికాలో గిరాకీ ఎక్కువయింది. అయిదారేళ్ళ క్రిందటిదాకా ఇటలీ, జపాను అమెరికాకు శత్రుదేశాలు. గత యుద్ధంలో తమవారు చనిపోవడం గుర్తున్న ప్రతి అమెరికన్ గృహిణి జాపనీస్ ముఖం కనిపిస్తే ఏవగించుకొనేది. అటువంటిది ఇప్పుడు జాపనీస్ చిత్రాలు బాగా 'పాప్యులర్' అయ్యాయి. అమెరికన్లు అభివృద్ధి అంటే ఒక్క ఆర్థికాభివృద్ధి అని మాత్రమే భావిస్తారు. దానికోసం ఏపనైనా చేస్తారు. అమెరికన్ ప్రజలు తమ చిత్రాల మీద విసుగుపుట్టి, ఇతర దేశాల చిత్రాల మీద మోజుపడుతున్నారు కనుక, అమెరికన్ డిస్ట్రిబ్యూటర్లు భారతదేశంనుండి చిత్రాలు దిగుమతి చేసుకోగోరుతున్నారు. టెక్నికల్‌గా భారతీయ చిత్రాలు వారి చిత్రాలతో సరిరాకపోయినా, ఏదో ఒక విధమైన కొత్తదనం ఉంటుంది గదా.

ఒక యింట్లో వైరింగు మరమ్మతులు చేస్తున్న ఎలక్ట్రిషియను తన అసిస్టెంటును పిలిచి రెండు తీగెలు చూపించి ఏదో ఒకదాన్ని ముట్టుకోమన్నాడు అసిస్టెంటు ముట్టుకున్నాడు.

"ఎలావుంది?" అని అడిగాడు ఎలక్ట్రిషియను.

"బాగానే వుందే? ఏమీ లేదే?" అన్నాడు అసిస్టెంటు.

"ఒహో. సర్లే. ఏ తీగెవదో తెలియక నిన్ను ముట్టుకోమన్నాను. ఆ రెండో తీగె ముట్టుకోకు. షాక్ కొట్టి చస్తావు"

అమెరికన్లు చిత్రాలలో 'రియలిజం', 'డ్రామా' ఉండాలని కోరుతారు. భారతీయులు 'ఐడియలిజం', 'మెలో డ్రామా' అభిమానిస్తారు. అందుకే మన చిత్రాలకూ, వారి చిత్రాలకూ వైరుధ్యం

నిలవ నీడలేని అక్కా, తమ్ముళ్లను తన యింటికి రమ్మని బతిమాలుతున్నాడు గంగు.
యునైటెడ్ టెక్నీషియన్స్ & శ్యామలావారి "పల్లెపడుచు"లో దృశ్యం

★

నేషనల్ ఆర్ట్ థియేటరువారి ''తోడుదొంగలు''లో డాక్టర్ శివరామకృష్ణయ్య, ఎన్. టి. రామారావు





గోకుల్ పిక్చర్సువారి "నిరుపేదలు" లో సురభి బాలసరస్వతి.

# యూరప్, అమెరికాలో సినిమా పరిశ్రమ

ఉంటుంది. కాని ప్రస్తుతానికి కొంతకాలం దాకా మన చిత్రాలు అమెరికాలో బాగానే పోవచ్చు కాని కొంతకాలం తరవాతనైనా మన నిర్మాతలు ఇతర దేశాలకు ఎగుమతి చేసే చిత్రాలలో కొన్ని మార్పులు తీసుకురాక తప్పదు."

పార్థసారథిగారి ఉపన్యాసం తరవాత, సభకు అధ్యక్షత వహించిన కె. శ్రీనివాసన్ (మాజీ సెన్సార్ అధికారి) గారు పార్థసారథిగారిని అభినందిస్తూ మాట్లాడారు.

* * *

జనతా ప్రొడక్షన్స్ వారు తమ "పరివర్తన" చిత్రం షూటింగ్ ఈ నెలలో ప్రారంభం చేస్తున్నారని తెలుస్తోంది. ఎ. నాగేశ్వరరావు, ఎన్. టి. రామారావు, సావిత్రి ముఖ్య తారలు, దొరస్వామి, కుటుంబరావు, రమణారెడ్డి, మిక్కిలినేని ఈ చిత్రంలో నటిస్తున్నారు. తాతినేని ప్రకాశరావు గారు డైరెక్టు చేస్తారు. సంగీతం మోహనదాసు, చలపతిరావు; మాటలు, పాటలు అనిసెట్టి సుబ్బారావు, పినిసెట్టి శ్రీరామమూర్తిగారు.



భరణివారి "చక్రపాణి" లో రమణారెడ్డి, సి. ఎస్. ఆర్., భానుమతి మొదలైనవారు.

# యోగాసనములు-దేహారోగ్యము

## 7. మూత్రరోగములు - వ్యాయామ యోగచికిత్స

మానవులకు సందేహమనునది అత్యంత బాధకరమైన మనోరోగము. ఇది మనో ధర్మము. దేహయంత్రమును నడుపు పదకొండు కీలకములలో మనస్సు అత్యంత ప్రధానమైనది. ఈ మనస్సుయొక్క వ్యాపారమును చెడగొట్టి దారి తప్పించునది సందేహము. మనస్సునకు సందేహము' అను రోగము ఒకసారి సంప్రాప్తమైనచో, ఇంక మిగిలిన ఇంద్రియముల వ్యాపారముకూడ గతితప్పగలదు. ఇది సర్వజనులకును అనుభవైక వేద్యమైన విషయము.

"అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి॥ నాయం లోకోఽస్తి నపరో నసుఖం సంశయాత్మనః॥"

అని శ్రీ భగవద్గీతా వాక్యము.

సర్వవిధ మనోరోగములకును ప్రధాన హేతువులు మూడు:—ఆహారదోషము, సంగదోషము, దృష్టిదోషము. వీనిలో ఆహారదోషము చాలచెడ్డది. కారణములేనిది కార్యములేదు. కారణముయొక్క గుణములు కార్యమందు వ్యాపించును. ఎట్టి ఆహారమును మనము భుజింతుమో, అందే యే గుణములుండునో, అవియే మనోవ్యాపార, శరీరపరిణామములందు ప్రతిఫలించును.

ఇది యనుభవసిద్ధము. ఆహారములో నంతర్గతమైయుండు గుణదోషములు కండ్లకు కానరాకున్నను, ఆహారమును భుజించిన పిదప మానసికానుభవ గోచరములై శరీరమునందు సత్పరిణామములకుగాని దుష్పరిణామములకుగాని హేతువులగుచున్నవి.

"అన్నమశితం త్రేధా విధీయతే
తస్యయః స్థవిష్ఠోధాతుః తత్పురీషం
"భవతి యోమధ్యమః తన్మాంసం
యోఽణిష్ఠః తన్మనః
"ఆపః పీతాః త్రేధా విధీయన్తే
తాసాంయః స్థవిష్ఠో ధాతుః తన్మూత్రం
"భవతియోమధ్యమః తల్లోహితం
యోఽణిష్ఠః సప్రాణః
"తేజోఽశితం త్రేధావిధీయతే
తస్యయః స్థవిష్ఠోదాతుః తదస్థిభవతి
"యోమధ్యమః సమజ్జాయోఽణిష్ఠః
సావాక్
"అన్నమయంహి సౌమ్యమనః
అపోమయః ప్రాణః తేజోమయా
వాక్ ఇతి॥"

(ఛాందోగ్యోపనిషత్తు ఆరవ ప్రపాఠకము)

అనగా—ఆహారము మూడు విధములు ఘనము, ద్రవము, స్నిగ్ధము.

అన్నము, పప్పు మొదలైనవి ఘనములు.

నీళ్లు, పాలు మొదలైనవి ద్రవములు.

నెయ్యి, వెన్న మొదలగునవి స్నిగ్ధములు.

మనము భుజించు ఘన వస్తువులలోని అత్యంత స్థూలభాగము మలముగాను, అత్యంత మధ్యభాగము మాంసముగాను, పరమ సూక్ష్మాంశము "మనశ్శక్తిగుణము" గాను శరీరయంత్రములో పరిణామము చెందును.

శ్రీ టి. కృష్ణమాచారి

ద్రవవస్తువులోని స్థూలాంశము మూత్రముగాను, మధ్యాంశము రక్తముగాను, పరమ సూక్ష్మాంశము "ప్రాణశక్తి"గాను పరిణమించును.

స్నిగ్ధవస్తువులలోని స్థూలాంశము ఎముకలకు, మధ్యాంశము మజ్జామేధము (క్రొవ్వు) నకు, పరమ సూక్ష్మాంశము "వాక్‌శక్తికి" చేరును.

దైవ నిర్మితమైన మన శరీరయంత్రమునందలి అత్యాశ్చర్యకరమైన శక్తి యిదియే. ఆధునికవైజ్ఞానిక ప్రవీణులు ఎట్టియంత్రముల సహాయముచేతగాని పై ఆహార వస్తువులను ఆరీతిగా మార్చజాలరు.

మనస్సుయొక్క శక్తి, మనోవ్యాపారములైన శాంతిస్థైర్యములు, సందేహ చాంచల్యములు, భుజించు ఆహారముయొక్క గుణములకు అనుగుణముగా సంభవించుచున్నవి. దాని ఫలితముగానే మనోరోగములు, ఇంద్రియరోగములు, ఇతర శారీరక రోగములు సంభవించుచున్నవి. ఆహారగుణములే మానవుల ఆరోగ్యమునకుగాని అనారోగ్యమునకుగాని మూలకందమగుచున్నవి. సందేహ చాంచల్యములే మనోరోగములకు హేతువులనియు, శాంతిస్థైర్యములే ఆరోగ్య కారణములనియు ఉద్దాలకముని నిత్య సంశయాత్ముడైన తన కుమారునకు బోధించినాడు. ఈ యంశమును మనము గ్రహించి మనసంతానమును సక్రమమార్గములో ప్రవర్తింపచేసినచో, వారికి జీవితమందు సుఖమును ప్రసాదించినవారము కాగలము.

ప్రతివిషయమునను మనస్సునందు సందేహములు జనించుటకు భుజించు ఆహారమునందలి గుణదోషములే హేతువులని ప్రత్యక్ష నిదర్శనములను జూపవచ్చును. కొందరు పసిపిల్లలకు సాత్వికాహారములను, మరి కొందరు పిల్లలకు స్వేచ్ఛాహారములను ఇచ్చి పెంచి అయిదారు సంవత్సరముల అనంతరము వారి శరీరస్థితినీ, మనోవ్యాపారమునూ గమనించి నిష్పక్షపాతముగ పరిశీలించినచో పై విషయము సత్యమని ధ్రువపడగలదు.

కాని అట్లు చేయగల వారెవరు? రాజకీయ రంగమందు ఎట్టి కార్యమునకు గాని కోట్లాది ద్రవ్యమును వెచ్చించుటకు వెనుదీయనివారు ఇట్టి విషయములందు పరిశోధనకు ప్రోత్సాహమిచ్చి భారతీయ స్త్రీ పురుష సంతానముయొక్క బాగోగులకై పాటుపడగలరా? పాశ్చాత్యుల నడకలు మన కెందుకో తెలియదు. భారతీయులు తత్త్వజ్ఞానులు. వీరు ప్రాకృతవాదులు. ఈవ్యత్యాసమునందరూ అంగీకరించిరనియే నా నమ్మిక.

ఛాందోగ్యోపనిషత్తులో
"ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః సత్వశుద్ధౌ
ధ్రువాస్మృతిః స్మృతిప్రలంభే
"సర్వగ్రంధీనాం విప్రమోక్షః"

అనియు,

శ్రీభగవద్గీతలో
"ఆయుస్సత్వ బలారోగ్య
సుఖప్రీతి వివర్ధనాః
"రస్యాః స్నిగ్ధాః స్థిరాహృద్యాః
ఆహారాః సాత్త్వికప్రియాః
"కట్వామ్ల లవణాత్యుష్ణ
తీక్ష్ణరూక్ష విదాహినః
"ఆహారా రాజసస్యేష్టాః
దుఃఖశోకామయప్రదాః
"యాతయామం గతరసంపూతి
పర్యుషితం చయత్
"ఉచ్ఛిష్ట మపిచామేధ్యం
భోజనం తామసప్రియమ్."

అనియు చెప్పబడినది. అనగా మన శారీరిక మానసేంద్రియ గుణకార్యములు ఆహార గుణముల అధీనములని యుపదేశించు

చున్నవి. ఇప్పుడు శ్రీ భగవద్గీత టీకా వ్యాఖ్యాన సహితముగ నన్ని భాషలలోనూ లభ్యమగుచున్నందున ఇచ్చట పై శ్లోకమును వివరించలేదు.

వెనుకటి వ్యాసమందు మూత్రరోగ నివారణకు వ్యాయామయోగములే ముఖ్యసాధనలని చెప్పియున్నాను. ఈ విషయమై సందేహము కల వారి నిమిత్తము మొదట ఆయుర్వేద సుశ్రుత వచనములను వివరించి అటు పిమ్మట యోగరహస్య వచనములను వివరింతును. ఆ సుశ్రుతములో ప్రమేహ చికిత్సా ప్రకరణమునందు (ప్రమేహమనగా అతిమూత్రము మొదలగు మూత్రసంబంధమగు రోగములు) ఔషధాదుల యవసరము లేకనే ప్రమేహమునకు వ్యాయామము చేతనే చికిత్స చేయనగునని చెప్పబడినది.

"వ్యాయామ యోగైః వివిధైః ప్రగాఢైః
"ఉద్వర్తనైః స్నానజలావసేకైః
"సేవ్యత్వ గేలాగరు చందనాద్యైః
"విలేపనైశ్చాశు నిహన్తి మేహాః"
(నష్టస్తి మేహాః)

అనగా పలువిధములైన గాఢ (శ్రద్ధా నియమములతో గూడిన) వ్యాయామ యోగములచేతను, వళ్ళు నలుచుకొనుట, స్నానము, నీళ్ళలో తల మున్కలుగా స్నానముచేయుట, (అనగా 12 మారులు నీటిలో కొన్ని సెకండ్లు చొప్పున మునిగియుండుట) వట్టివేళ్ళు, దాల్చిన చెక్క, వలకులు (వక్కలు), అగరు చందనము మొదలగు సుగంధ ద్రవ్యములతో శరీరమలందుకొనుట-వీనివలన మూత్రరోగము త్వరలో నిర్మూలమగునని యర్థము. ఈ చికిత్సా విధానమువలన రోగి శరీరములో ప్రకోపించిన కఫము తగ్గి మూత్రరోగము నివారణ కాగలదు.

దేశము, నివాసము, ఆహారము మొదలగు వానివలన మూత్రరోగములు వివిధ రూపములలో వచ్చినప్పుడు పైనచెప్పబడిన వ్యాయామయోగ చికిత్సలతోబాటు సుశ్రుతుడు ఈ క్రింది అంశమునుగూడ వ్రాసియున్నాడు.

"అధనస్తు అబాంధవో
పాదత్రాణాతపత్ర విరహితః
"భైక్ష్యాశీ గ్రామైకరాత్రవాసీ
మునివత్ సంయతాత్మ
"యోజనశతం అధికంవా గచ్ఛేత్."

అనగా ధనాదులందు ఆశలను వదలి, వానిని త్యజించి, బంధువులను మరచి, చెప్పులు గొడుగు లేకయే, బిచ్చమెత్తి భుజించుచూ, మునులవలె ఇంద్రియములను నిగ్రహించి 1000 మైళ్ళకుపైగా పాదచారియై తిరుగవలెనని అర్థము.

"మహాధనోవా శ్యామాకనీవార వృత్తిః
ఆమలక కపిత్థ తిందుక
"అశ్మంతక ఫలాహారః మృగైఃసహ
సంవసేత్ తన్మాత్రశకృద్భక్షే
"సతతమనువ్రజేత్ బ్రాహ్మణో
వాసి లోంఛవృత్తిర్భూత్వా
"బ్రహ్మరథ ముపధారయేత్
పఠేత్ సతతమ్."

అనగా ఎంత మిక్కిలి ధనికుడైననూ చామలు, నీవార ధాన్యములను ఆహారముగా తీసుకొనుచు, ఉశిరిక, పండువెలగ, తిందురము, అశ్మంతకము మొదలగు అడవి ఫలములను భుజించుచు, అడవిలో మృగముల మధ్య నివసించవలెను. లేదా గోవులను కాయుచు మాటిమాటికీ పంచగవ్యము సేవించుచు గడపవలెను. బ్రాహ్మణుడైనచో కళ్లములలోనూ దంపుడురాతివద్దనూ పడిన గింజలను ఏరుకొని తినుచు, బ్రహ్మరథమును పట్టవలెను. అనగా యతీశ్వరులను భుజములపై మోయవలెను. ఎల్లప్పుడు వేదాధ్యయనము చేయుచుండవలెను.

"ఇతరఃఖనేద్వా కూపం
కృశంతు సతతంరక్షేత్"

ఇతరులు, అనగా కాయకష్టము చేయువారు నూయిగాని చెరువుగాని త్రవ్వవలెను.

అయితే ప్రమేహరోగమువలన (మూత్రరోగములు) బాధపడువారు శరీరము శుష్కించుచున్నచో దేహపుష్టి కలుగుటకు ప్రయత్నించి దేహమును రక్షించుకొనుటవసరము.

"అధనోవా వైద్యసందేశాత్
ఏవంకుర్వన్ అతీంద్రితః
"సంవత్సరాదంత రాద్వా
ప్రమేహాత్ ప్రతిముంచతి
"ప్రవృద్ధమేహోస్తు నియుద్ధ
క్రీడాగజ తురగరథ
"పదాతిచర్యా పరిక్రమణాని
అస్త్రాస్త్రోపాస్త్ర సాధనాని సేవేరన్."

అనగా:—ఎంత డబ్బు లేనివాడైననూ వైద్యులు సూచించు ప్రకారము సోమరితనము లేక పైన చెప్పినరీతి ననుసరించిన యెడల సంవత్సరము పిమ్మటగాని అంతకు లోపుగా గాని ప్రమేహ (మూత్ర)రోగము నుండి రక్షింపబడును.

రోగము మిక్కిలి ప్రకోపించిన వారికైననూ వ్యాయామయోగము, కుస్తీపట్లు, ఆటలు, ఏనుగులు గుర్రములు రథములు మొదలగువానిపైన సవారిచేయుట పదాతిదళములో చేరుట, అస్త్రయులను ఉపాస్త్రములను అభ్యసించుట మొదలగు శారీర వ్యాయామ క్రియలవలన తప్పక లాభము కలుగును.

"వ్యాయామక్షుణ్ణగాత్రస్య
పద్భ్యా ముద్వర్తితస్యచ
"వ్యాధయో నోపసర్పంతి
సింహంక్షుద్రమృగాఇవ."

అనగా: సింహమును సమీపించుటకు కుక్క నక్క మొదలగు క్షుద్రమృగములు వెరచునట్లు వ్యాయామయోగమువల్లను, విశేషముగా సంచారము చేయుటవల్లను నలిగిన శరీరమును రోగములు చేరజాలవని అర్థము.

వ్యాయామ యోగములకు శరీరమర్దనకు గల పరస్పర సంబంధమునుబట్టి ఆయుర్వేద, యోగశాస్త్రములచేత ఆ రెండూ అభివృద్ధి చెందినవి. శరీరమర్దన అనునది ఇప్పటికిని మలబారు, పలూరు ప్రాంతములందు వాడుకలో నున్నది. ఈ శరీరమర్దన యోగవ్యాయామములు రోగములను దరిచేరనీయవు.

"జలేన శ్రమజాతేన
గాత్రమర్దన మాచరేత్
"దృఢతాలఘుతా చైవ
తేన గాత్రస్య జాయతే."
(హఠయోగ ప్రదీపిక)

అనగా: యోగాంగ సాధనాతి శయము చేత పుట్టిన చెమటతో శరీరమును పిసికి నలిగించవలెనని చెప్పబడినది. దీనివలన శరీ

# ★ యోగాసనములు - దేహారోగ్యము ★

రము గట్టిపడి చులకనై రోగములకు చోటీయదు.

ఈరీతిగా ఔషధసేవనకంటె వ్యాయామ యోగములకే రోగనివారణశక్తి అధికమని వైద్యశాస్త్రములు గూడ హెచ్చరించుచున్నవని సందేహామనస్కులైనవారి కొరకై ఉదహరించినాను.

ఇంక యోగశాస్త్రములో ఆధారవచనములను గమనించుడు.

"అత్యంతం వనితాసంగ
దోషాత్ నిద్రా పరిక్షయాత్
"అజీర్ణ హాయుదోషాచ్చ
విషయాసక్త మానసాత్" ౧

"కేషాంచిద్ధ స్తయభీనాత్
మలమూత్ర నిరోధతః
"రజస్వలా స్త్రీ సంగాచ్చ
దివానిద్రా దితోఽపిచ" ౨

"దివామైథునతశ్చైవ
పుంసాం స్త్రీణాం విశేషతః
"నానావిధా మూత్రరోగాః
జాయంతే నాత్ర సంశయః" ౩

"మేహారోగాభిధాశ్చైతే
ఆయుఃశక్తి వినాశకాః
"తస్మాత్సర్వే జాగరూకా
రహస్యేంద్రియ రక్షకాః
"భవేయు రితి శాండిల్యః
ప్రాహాయోగ రహస్యవిత్" ౪

ఇవి మూత్రరోగ కారణములు. ఇంక మూత్రరోగ భేదములు:—

"మధుమూత్రః తంతుమూత్రః
బిందుమూత్ర అమూత్రకః
"బహుమూత్రశ్చ సర్వేవై
పిపాసార్తా భవన్తిహి" ౧

"స్త్రీణామపి సమానోఽయం రోగః
శోక వినాశకః
"బాలాయువానః స్థవిరా
నరానార్యో వ్యతిక్రమాత్" ౨

అంకెల లెక్కల చదరముగల గైడు:— నిలువు, అడ్డము, ఐమూలలు ఎటుకూడినా ఒకే మొత్తము వచ్చునట్లు 64 సరియైనఅన్సర్లు వ్రాసి పంపబడును. ఎన్ని మొత్తములకైనను ఈ ఒక్క గైడుమాత్రమే సహాయము కాగలదు. ఖరీదు 8 అణాలు M. O. గానిపోస్టు బిళ్లలుగాని ముందుగా పంపవలెను. లక్ష్మీమన్న. ఉపాధ్యాయుడు, బోర్డుస్కూలు. మోపిడి. అమిద్యాలపోస్టు. అనంతపురంజిల్లా.

"మూత్రరోగ పరీతాశ్చ
లభన్తి శయనే సదా
"శరీర రక్షణా జ్ఞానాత్
హీన వీర్యాగతాయుషః" ౩

"తస్మాత్తత్ర చికిత్సాం
వైయోగికం ప్రవదామ్యహం
"శృణు మాండవ్య పరయా
శ్రద్ధయా శుద్ధమానసః" ౪

మూత్రరోగముల చిహ్నములు:—
"రజఃశుక్ల విమిశ్రస్తు
మూత్రస్స్రవతి చేద్బహు
"మధుమూత్రాభిధోరోగః
హాన్తిజీవన మాత్రకం" —౧

"ప్రాక్ మూత్ర స్రవణాత్
శుక్ల రజోబిందుః పతేద్యది
"తంత్వాకారేణతం విద్యాత్
తంతుమూత్ర గదంబుధః" —౨

"మూత్రప్రావో నైవభవేత్
కేవలం రేత ఆపతేత్
"బిందుమూత్రాఖ్య రోగోఽయం
వీర్యనాశ విభేదకః" —౩

"నవీర్యబిందుః నోమూత్రం
బహిర్యాతి పరంవృథా
అవీర్యనాశా దానాభేః
నూచ్యాఖాత సమాయదా
"తదా విద్యాదమూత్రాఖ్య
మూత్రరోగం బుధోత్తమః"
—౪

"రోగోఽయం ప్రాణహారీస్యాత్
శ్వాసోచ్ఛ్వాస నిరోధకః"—౫

"అనుక్షణం మూత్రబిందుః
బహిర్వా మూత్రవాహినీ
"బహుమూత్ర దదోజ్ఞేయః
రక్తక్షీణత్వ కారకః" —౬

"గదోఽయం పీడయే
న్మూత్రనాశంతస్య సమంతతః
"తేన నేత్రగద స్తస్మాత్
అంధాస్స్యుర్మానవాభువి"—౭

"ఇత్యాదయో మహారోగా
మూత్ర పిండోద్భవాన్నణామ్
"కృత్యాపచారా జాయంతే
శక్త్యాయుః క్షైణ్యకారకాః" ౮
"విశోదరా యదానాడీ
శిథిలాభిద్రితా భవేత్
"తదామూత్ర గదోత్పత్తిః
నైవశంకాం కురుద్విజ." ౯
"మూత్ర రోగాను జా
స్సర్వే విమరక్తగదాస్సదా
"బాధంతే హ్యాదయం
నాభింయోనిం వీర్యగుహాం లఘు,
ఈ రోగముల చికిత్సలు:—
"తత్రోడియాణం కర్మాహ
గోరక్షస్తు చికిత్సకం
"విపరీతాఖ్య కరిణీం
సభాగాం సాంగికాంసదా
"శీతలీ నాడికాశుద్ధి
ప్రాణాయామా సదాచరేత్
"యస్తు సంపీడ్యతే మూత్ర
రోగైః సర్వవిధైరపి
"సముచ్యతే వేదనాభిః
సకలాభి ర్న సంశయః
"నాతపే సంచరేత్ నైవ
వదేదుచ్చైర్నచాపిహి
"గచ్ఛేదధ్వాన మత్యుష్ణ
క్షార భోజీభవేన్నహి
"శీతలం నారికేళోత్థం
పానీయం సంప్రశస్యతే
"గవ్యమేవ పయస్తక్ర
దధ్యాజ్యాది సుపథ్యకమ్
"సదా సుగంధ లేపేన
శరీరం లఘుమాగయేత్
"మదిరా కుక్కుటాండాది
మాంసభోజీ భవేద్యది
"నిష్ఫలం సాధనంతస్య
షండస్యరణేయథా
"ప్రత్యహం ప్రాతరుత్థాయ
సాయాహ్నే చ విశేషతః
"కర్తవ్యం శక్తితో నిత్య
ముప్రమత్తేస్తు మానవైః
"మాసత్రయాదూర్ధ్వతోహి
శుద్ధా విశోదరాభవేత్
"మూత్రపిండ విశుద్ధిశ్చ
రక్తవృద్ధి స్సేదినే"

ఈ శ్లోకముల తాత్పర్యము ముందువ్యాసములో, అనగా ఆరవవ్యాసమందు వివరించబడినందువలన తిరిగి వ్రాయబూనుకొనలేదు. ఈ గ్రంథము బహుపురాతనము; ఎచ్చటనూ దొరుకదు. కావున వీని నిచ్చట పొందుపరచినాను.

"యోరక్షతి రహస్యాక్షం
సరక్షతి జగత్త్రయమ్
"యశ్చస్మరతి లక్ష్మీశం
ససంసారే సుఖం వసేత్."

అనగా ఎవరు రహస్యాంగమును రక్షించుకొనగలరో వారు మూడులోకములను రక్షింపగలరు. సర్వాంతర్యామియైన శ్రీమల్లక్ష్మీనారాయణ దేవుని ఎవరు నిత్యము భజింతురో, వారు సంసారములో సర్వసుఖములను పొందగలరు.

[సశేషం]

# పరిణామం

(8-వ పేజీ తరువాయి)

"చాలా మంచివారే ఆయన, మా డివిజనుకి రెండు సబ్జెక్ట్సు తీస్తారు. బాగా చెబుతారుకూడా" అన్నాడు సుందరం.

తను మెదలకుండా ఊరుకొంది. ఆరాత్రంతా ఆతని ఆఖరి మాటలు మనసులో మెదిలాయి. వాటి అర్థమేమిటి? ఆమాటలనడంలో అతనిభావం? కాస్త ఆలోచిస్తే పదివేల ప్లాను ఇతనిది కాదల్లే ఉంది. అయితే తండ్రి అలాఅంటే ఇతనెందుకుఊరుకొన్నాడు? ఖండితంగా చెబితే తండ్రి ఏమనగలడు?

ఓ ఆదివారం సీత, సుందరం, మ్యాటనీకి వెళ్లారు. వాళ్లకోసం గోపాలం వచ్చాడు. ఈమధ్య వాళ్ళతో జోస్తీ ఎక్కువైనట్టుంది.

"వాళ్ళు సినిమాకి వెళ్ళారు. పోనీ వచ్చేదాకా కూర్చోండి" అన్నది తాను.

"మీరు వెళ్ళలేదే!" అన్నాడాతను కూర్చుంటూ.

"కొంచెం తలనెప్పిగా ఉంది. అయినా ఇంటివాళ్ళు లేరు. ఇల్లు తాళం పెట్టి వెళ్ళడం ఇష్టంలేక ఉండిపోయాను" అంది. అతనితో ప్రసంగం పెంచడం సుతరామూ ఇష్టంలేదు. పదినిమిషాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి. అప్పుడతను అన్నాడు.

"మణిగారూ! మీతో ఎన్నాళ్ళనించో ఓమాట చెబుదామనుకొంటున్నాను. అవకాశం చిక్కలేదు. మీ నాన్నగారు మా నాన్నగారితో మాట్లాడినపుడు, మానాన్న పదివేలివ్వలేకపోతే మాటలే అనవసరమని అన్నారుట. దానిముందు కథ ఇది: మిమ్మల్ని చూశాక నేను మానాన్నతో నా అంగీకారం తెల్పాను. ఆయన కట్నం కుదరాలికదా? అన్నారు. "నాన్నా కట్నం కోసం చెడిపోనివ్వద్దు. వాళ్ళు ఎంత ఇవ్వగలరో అంతే పుచ్చుకో. అసలివ్వలేమన్నా ఒప్పుకో నాన్నా నాకోసం" అని విడియం విడిచి చెప్పాను. ఆయన మాట్లాడలేదు. మౌనం అంగీకార సూచకం అని అనుకొన్నాను. తరవాత వెంటనే ఈ లెక్చరర్ పోస్టుకి ఇంటర్వ్యూకి వచ్చేశాను. నేనులేనప్పుడు మీనాన్నగారు వచ్చారు.తరవాత జరిగింది నాకు తెలిసింది. ఎంతో బాధపడ్డాను. కాని ఏం చెయ్యగలను? చెయ్యి దాటిపోయింది. నాకా అదృష్టం లేదనుకున్నాను. అప్పటినుంచి ఇప్పటివరకు, ఆ విషయంలో విముఖతతోనే ఉన్నాను. ఈనాటికైనా మీరు నాపైగల అభిప్రాయాన్ని మార్చుకొంటారని ఆశిస్తున్నాను. మీరు ఈ నా మాటలన్నీ నమ్మి ఉన్నట్టయితే నే ధన్యుణ్ణి."

తాను ఏదో లోకంలో ఉన్నట్టనిపించింది.

"మార్చుకో నవసరం లేదు. మీమీద నాకెప్పుడూ సదభిప్రాయమే" అన్నది. అతనిముఖం ఆనందంతో వికసించింది.

"ఇక మీ కేఅభ్యంతరం లేదనుకొంటాను" అన్నాడు మెల్లగా.

"మళ్ళీ ఆదివారం వస్తారుకాదూ?"అంది తాను.

సీత, సుందరం, రాగానే వాళ్లదగ్గర ఏవో పుస్తకాలు తీసికొని వెళ్లిపోయాడతను.

ఆదివారం అంతా తాను ఆలోచిస్తూనే ఉంది. తానంగీకరిస్తే ఏమి? నాన్న కిష్టం ఉండదా? అసలు నాన్నేగా, ఈసంబంధం కోసం ప్రయత్నించింది! అది తప్పిపోతే చాలాబాధపడ్డారు కూడాను. ఈసారి గోపాలం రాగానే తన అంగీకారం తెలుప నిశ్చయించుకొంది.

వారంరోజులకి తానూ, గోపాలం ఇంటికి వచ్చారు. నాన్న గోపాలాన్ని చూసి నివ్వెరపోయారు. అంతలోనే సంబాళించుకొని లోనికాహ్వానించి మర్యాద చేశారు. అమ్మకి ఎంతో సంతోషంకలిగింది. నాన్న ఆరాత్రి తనతో అన్నారు. "నేను చేయలేని పని నీవు చేయగలిగావమ్మా" అని. నాన్న అయిదువేలు కట్నం ఇస్తానన్నారు, గోపాలం వద్దన్నాడు గాని.

"వచ్చే ఏడుకూడా సీత సుందరం మా దగ్గరే ఉంటారు నాన్నా" అంది తాను "అలాగేనమ్మా" అంటున్న నాన్న కళ్లల్లో నీళ్లు నిలిచినై. అవి ఆనందబాష్పాలో దుఃఖబాష్పాలో ఆయనకే తెలుసు. ★

# మొదటిరోజు

(9-వ పేజీ తరువాయి)

జరుగుతున్న విషయా లెలా తెలుస్తాయి. ఉద్యోగంలో చేరగానే ముందు పై ఆఫీసరుకు కృతజ్ఞత తెలుపుకోవాలన్న విధి మా రక్తంలో యింజెక్టు చేయబడేది. అందుకే ముందు మీవద్దకు సరాసరి వచ్చింది. మీరు కూడా చిన్న క్లర్కు వుద్యోగంనుంచే యింతవరకూ వచ్చారు కాబట్టి కింది వుద్యోగస్తుల సాధకబాధకాలు మీకు తెలుసు. అందుకే మీకు స్టాఫ్ అంటే అంత అభిమానం ఆదరణా అని తెలిసింది. కాబట్టి ముందుముందు నావల్ల పొరపాట్లు యేవయినా జరిగినా, మీ పిల్లవాడిలా భావించి మన్నించగలరు.

"ఆఁ...ఆ...ఏమిటి అలా అంటారు" ముసలాయన వణికే గొంతుకతో అన్నాడు.

"మా నేజర్ని కలుసుకోడం తప్పని సరా సార్" అన్నాడు ఆనందరావు లేస్తూ.

"కలుసుకోడం మంచిదే, కాని ఆయన నాలాంటి సెమ్మదస్తుడు కాదు సుమా! జాగ్రత్త. అయినా నీలాంటివాడు ఆయన దగ్గర సర్దుకుపోగలడు. పరవాలేదు.

## మొదటి రోజు

పోయిరా." అన్నాడు. ఆ ముసలాయనకు ఆనందరావుని వదిలించుకోవడమే సమస్యగా తోచి అలా అన్నాడు. "నా బుట్టలో పడ్డావులే ముసలయ్యా" అని లోలోపల నవ్వుకుంటూ అవతలివైపు వున్న మానేజరి గదివేపు బూట్లు టకటక లాడించుకొంటూ వెళ్ళాడు.

ఆనందరావు వేషం, నడకా, ఠీవి, చూచి మానేజరు గదిముందు కూర్చున్న బంట్రోతు యెగిరి గంతేసి వొక్క నమస్కారం పెట్టాడు. ఆనందరావు జేబులోంచి కార్డుతీసి లోపల యిచ్చిరమ్మన్నాడు. లోపలికి వెళ్ళి "అయ్యగారు రమ్మంటున్నారు" అంటూ అంతలోకే తిరిగి వచ్చాడు ప్యూన్. లోపలికి వెళ్ళాడు ఆనందరావు.

"గుడ్ మార్నింగ్ సార్."

"గుడ్ మార్నింగ్. టేక్ యువర్ సీట్. అలా కూర్చోండి" అన్న మాటలు వినిపించాయి. తరువాత మానేజరు గదిలోని సంభాషణ బయటివాళ్లకు అంత స్పష్టంగా వినిపించలేదు. పదిహేను నిమిషాల అనంతరం "థాంక్స్" అంటూ నవ్వుకుంటూ బయటికివచ్చి సూపరింటెండెంటువద్దకు వెళ్ళాడు ఆనందరావు.

ఆనందరావును వదిలించుకొని, పనిమాని, సూపరింటెండెంటు, యీ కొత్త క్లార్కు విషయమే ఆలోచించాడు. 'కుర్రవాడయినా, బుద్ధిమంతుడిలా, చమత్కారిలా కనబడుతున్నాడు' అన్నది అతనిలో యేర్పడ్డ మొదటిభావం. 'ఏది యెలావున్నా వీడుమాత్రం ఘటికుడులాగే వున్నాడు' అన్నది రెండవది. అలుసిస్తే చంకనెక్కేటట్టున్నాడు. జాగ్రత్తగా మెసులుకోకపోతే తనకే మోసం తెస్తాడేమో, ఆపాటివాడే! కాబట్టి మొదటినుంచే ఆనందరావుని అణిచివుంచాలనుకున్నాడు. కాని ఆనందరావు వచ్చి యెదురుగుండా కూర్చోగానే అనుకున్నదంతా మర్చిపోయాడు ముసలాయన.

"మీకు అధిక శ్రమ యిస్తున్నందుకు క్షమించండి. అయినా కొత్తవాణ్ణి గనుక నేను చేయవలసిన పని యేమిటో, దాన్నెలా చేయాలో తెలియజెప్పితే అంతగా నేను మిమ్మల్ని మాటిమాటికొచ్చి బాధించాల్సిన అవసరముండదు. కొద్దిగా నేచర్ ఆఫ్ ది జాబ్ యేమిటో ఎక్స్‌ప్లెయిన్ చేస్తారా? నావిధి నేను నెరవేరుస్తాను. మీ కర్తవ్యాన్ని మీరు పాటించండి. ప్రతి కొత్తవాడితో వున్న బాధేయిది మీకూ, కొత్తగా యీ ఆఫీసులో చేరినప్పుడు, నాలాగే, అంతా అయోమయంగా వుండి, తెలియక తికమకపడి ఉంటారు. తప్పకుండా అలా అయి వుండాలి. అంతేనంటారా" అంటూ లేచాడు ఆనందరావు.

"ఆ...ఆ...అంతే. తప్పక. తప్పకుండా నీపనేమిటో చూపిస్తాను" అంటూ అతనూ కుర్చీలోంచి లేచాడు తనే స్వయంగా వెళ్ళి చూయించడానికి. తానింతకుముందు యేక్లర్కు ముందరా ఓడిపోలేదు. అందరిపైనా పాతిక సంవత్సరాలనుంచి తన హుకూమతు చలాయిస్తూ వచ్చాడు. అప్పుడప్పుడు మారే మానేజర్లు సహితం యీ ముసలాయనకు భయపడాల్సిందే! అలాంటి తనను ఆనందరావు వశపరుచుకున్నందుకు ఆ ముసలిగుండె తహతహలాడింది. అతనెందుకు తన్నిలా కిందుమీదులు చేస్తున్నాడో అర్థం కాలేదు. మళ్ళీ కుర్చీలో కూర్చున్నాడు. ఏదో అనాలనుకొని నోరు తెరిచి, యెదురుగుండా నిలుచున్న కొత్తక్లర్కు ముఖం చూచి, అనదలుచుకున్నది అనలేకపోయాడు. ఏమీ చేయలేక బెల్ నొక్కాడు. బంట్రోతు హాజరయ్యాడు.

"వెంకట్రావుగార్ని యిలా రమ్మను" హుకుంజారీఅయింది. వెంకట్రావువచ్చాడు. "వీరికి నీ డివిజెంటుపని యిచ్చి యీ కరస్పాండెన్సు చూడు. ఇదిగో ఆపని యెలా చేయాలో వీరికి తెలియజేయ్. తేలికైన పనేగా. ఆట్టే చేసుకపోవచ్చులే" "సరే సార్" అంటూ వెంకట్రావు బల్లపైనవున్న ఫైళ్ళను సర్ది చంకనబెట్టుకొని ముందుకు నడిచాడు. ఆనందరావు ఆ ముసలాయనకు వొక నమస్కారబాణం విసిరి వెంకట్రావు ననుసరించి బాతాఖానీ లగాయించాడు: "మన సూపరింటెండెంటు యెలాంటివాడంటావ్ బ్రదర్" అంటూ.

ఇంతవరకూ ఆనందరావుకీ ఆ ముసలాయనకీ యేదో బంధుత్వం వుండి వుంటుందని అనుకుంటున్న వెంకట్రావు యీ మాటలకు అదిరిపడి "ఏమంటారు" అన్నాడు.

"మన సూపరింటెండెంటు అన్ని ఆఫీసుల్లోవుండే రకమేనా, కాదా అని అడగటం"

"అదేమో చెప్పలేనుగాని మీరుమాత్రం అతన్ని మొదటిసారిగా ట్రోఫీలో వేసుకున్నారు. కొత్తవాళ్లతో యీవిధంగా మాట్లాడటం నేనువున్న నాలుగేళ్ళలో యిదే మొదటిసారి. మానేజరు గారికయినా భయపడం యీయనకు రుచిసినంత."

"అలాగా" అని చిన్నగా నవ్వాడు. అతని పనేమిటో తెలియజెప్పి పాతక్లార్కు వెళ్ళిపోయాడు. ఆనందం బల్లముందు కూర్చొని పని మొదలుపెట్టక యేదో ఆలోచించసాగాడు. పదినిమిషాలకు ఆలోచన తట్టింది. ఒక కాగితంపైన యేదో వ్రాసి దాన్ని టైపు చేయించుకొన్నాడు. అప్పటికి వొంటిగంటఅయింది. అందరూ మెల్లిగా భోజనాలకు బయలుదేరారు. ఆపూటకు యీ కొత్త వుద్యోగి చేసిన పని యేమీ లేదు. పని చేయకుండా అలా అటూ యిటూ తిరుగుతున్న ఆనందరావును చూచి "అబ్బాయ్ కొత్తగా వుద్యోగంలో ప్రవేశించావు; యిలా నడుచుకుంటే అది కాస్తా దక్కడం కష్టం" అని పిలిచి మందలిద్దామనుకొంటున్న సూపరింటెండెంటు దగ్గరికే వచ్చాడు ఆనందరావు టైపుచేయించుకున్న కాగితంతో.

ముసలాయన కాగితం వేపూ ఆనందరావు వైపూ రెండుసార్లు చూచి: "నీ అభిప్రాయం మంచిదే. కొత్తగా వుద్యోగంలో ప్రవేశించి పరిచయార్థం యిలా పార్టీ యివ్వడం సబబయినదే అయినా...వృధా డబ్బు దండగ. కొన్నాళ్లుంటే వాళ్లంతట వారే పరిచయమౌతారు" అన్నాడు.

"అలా అనకండి. ఎప్పుడూ ఇలాగే ఖర్చు చేయబోనుగా! మీరు వొప్పుకోవాలి. అంతే కాదు చీఫ్ గెస్టుగా వుండాలి. దయచేసి సంతకం పెట్టి సర్క్యులేటు చేయించండి. అది నా ప్రార్థన" అన్నాడు కొంత బలవంతపెడుతున్నట్టుగానే ఆనందరావు.

"సరే" అన్నాడు ఆయన.

రోజులు, వారాలు, నెలలూ గడిచిపోయాయి. ఆనందరావు ఆఫీసులో వుద్యోగం చేయబట్టి మూడేళ్ళయింది. ఎవరితో మాట పడకుండా పనిచేసుకొచ్చాడు. సూపరింటెండెంటు రిటైర్డ్ అయ్యాడు. తనకే ఆస్థానం దొరికింది. అందుకు సూపరింటెండెంటుకూడా యెంతో ప్రయత్నించాడని అనుకున్నారు. ఆయనకు "ఫేర్ వెల్ పార్టీ" యిచ్చింది ఆనందరావే...

.....ఆనందరావు ఆఫీసులో అడుగుపెట్టాడు.

ఎదురుగుండా సూపరింటెండెంటు పెద్దపులిలా కూర్చొని ఫైళ్లు తిరగేస్తున్నాడు.

అతని కిరుప్రక్కలా క్లర్కులు వంచిన తల ఎత్తకుండా రాసేస్తున్నారు.

ఆనందాన్ని చూచి ఆయన లేచి వచ్చాడు.

"మీరిలా మొదటిరోజూనే ఆలస్యంగా రావడం యేమంత బాగా లేదు. ఆమాత్రం బాధ్యత గుర్తించుకోకపోతే ఎలా. ఇప్పుడు టైమ్ ఎంతయిందో చూడండి" అన్నాడు సూపరింటెండెంటు.

గోడగడియారం జవాబుగా పదకొండు కొట్టింది.

రెండు గంటలు దారిపొడుగునా కలలు కంటూ వచ్చాడని తెలుసుకొని తలవాల్చి "క్షమించండి సార్. పొరపాటు జరిగింది" అన్నాడు ఆనందరావు.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madra



సంధ్యా సమయం

—ఫొటో: జి. రామమూర్తి—[illegible]




శ్రీ జయనామసంవత్సర

# పంచాంగం

శ్రీ పిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రిసిద్ధాంతిగారిచే గుణించబడిన

ఈ సంవత్సరం పంచాంగంలో చాంద్రమాన, దృక్సిద్ధాంతాలప్రకారం
రెండుపద్ధతుల తిథి, నక్షత్రాదులు వేర్వేరుగా చూపబడినవి.

| | | |
|---|---|---|
| 48 పుటలు | వెల ప్రతి 1-కి | 0-3-0 |
| ,, | ,, 100 1-కి | 16-8-0 |
| ,, | ,, 1000 1-కి | 150-0-0 |

1000 కాపీలు ఒకే దఫా కొనువారి చిరునామా
ముఖపత్రమున ముద్రించబడును.

రైలు ఖర్చులు మినహా

---

మేనేజరు:—

## ఆంధ్రపత్రిక; మద్రాసు-1.